# వినోదిని

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం

సంపాదకుడు:

లయన్ కె.వి.గోవిందరావు బి.ఏ., ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు :

టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్సి.,

వి.బాలకుమార్ ఎమ్.ఏ.,బి.ఎల్.,

సభ్యులు :

కె.వి.ఎస్. శరత్‌బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.

కె.వి.ఎస్. విజయకుమార్

కె. రత్నకుమారి

చందా వివరాలు

జీవిత చందా ............ రూ॥ 350/-

3 సంవత్సరాల చందా.. రూ॥ 85/-

సంవత్సర చందా......... రూ॥ 30/-

ఎయిర్ మెయిల్ (1 సం॥) రూ॥ 125/-

సీ మెయిల్ (1 సం॥)...... రూ॥ 70/-

చందా పంపవలసిన చిరునామా

వినోదిని



9, దేశికా రోడ్, మైలాపూర్

మద్రాస్-600004.

ఫోన్: 75926


## ఈ సంచికలో

మే 1989


| | |
|---|---|
| ధ్యానం - సంపాదకుని పేజీ | 2 |
| నవ్యకల్పనాచతురుడు-డా॥ అలెగ్జాండర్ గ్రహంబెల్ | 4 |
| సీతాఫలము | 6 |
| ప్రపంచ నగరాలు - సావోపాలో | 8 |
| షిరిడీ సాయిబాబా | 9 |
| రాతి మనసు | 15 |
| తెలిసిన చెట్లు - తెలియని విషయాలు | 17 |
| 30,000 జాతుల సాలెపురుగులు | 19 |
| మొనళ్ళు | 23 |
| ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ | 25 |
| విజాలు - విదర్శనాలు | 28 |
| పుష్కరము | 31 |
| యేర్కాడ్ - అందమైన వేసవి విడిది | 33 |
| తలిదండ్రులకు సూచనలు | 35 |
| యాత్రాస్థలాలు - శబరిమల | 37 |
| కలంస్నేహితులు | 40 |
| గృహాలంకరణ | 41 |
| వీరిని గురించి తెలుసుకోండి | 44 |
| విటమిన 'ఎ' కంటికి రక్ష | 46 |
| అపూర్వ విషయాలు | 48 |
| వాల్మీకి లేకపోతే? | 51 |
| బహుమతి పొందిన వ్యాసం | 54 |
| గొంతులో పుండుకి తేనె దివ్యౌషధం | 57 |
| పర్వతారోహణం విలాసవంతమైన క్రీడ | 58 |
| పోటీలు | 59 |
| పోటీలు - ఫలితాలు | 63 |


ముఖచిత్రం:

షిరిడీ సాయిబాబా

## ధ్యానం

### దైవం ఇచ్చే తీర్పు




ప్రపంచంలో మనకు గోచరించేదంతా స్థిరంగా ఉంటుందనుకున్నావా? లేదు - ప్రతినిత్యం మారుతూనే ఉంటుంది. ఎప్పటికప్పుడు క్రొత్త రూపాలు ధరిస్తూంటుంది. ఆవేదనతో కూడిన జీవితానికి శాంతి ఉండదు. ఈ క్షణం ఉన్నది మరు క్షణం ఉండదు. ఇదంతా ఒక మాయాజాలం. అందువల్లే నీవు మానసికమైన శాంతి, భద్రత, ఆనందం సాధించి పోషించుకోవాలంటే ప్రాతిపదికమైన నిత్య తత్త్వాన్ని ఆశ్రయించు.

భౌతిక రూపాలు క్షణం క్షణం మారుతూన్నా నిజతత్త్వం అసలు మారదు. ఈ మార్పు చెందని నిజతత్త్వమే పరమార్థం. జీవితాన్ని సుఖమయం చేసుకోవాలంటావా? ఈ పరమార్థాన్ని అనుభవగతం చేసుకో. ప్రకృతి ధర్మమో, ప్రకృతి న్యాయమో

(మిగతా 3 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

### వివేకరహితమైన బుద్ధి ఆత్మ నాశనకరం

తెలివితేటలు ఉండటం బుద్ధిబలమే. కానీ ఈ బుద్ధిప్రభావం వికటిస్తే ప్రళయాంతక మవుతుంది. సత్యజిజ్ఞాస, ధర్మవిరతి పెరుగుతూన్న కొద్దీ, తీక్షణమైన కొద్దీ బుద్ధిలో దాగిన వివేకం ప్రజ్వలిస్తుంది. బుద్ధి ముఖ్య లక్షణమే వివేకం. వివేకం మంచిచెడ్డలను, ధర్మాధర్మాలను, సత్యాసత్యాలను వివేకించి సత్క్రమమార్గంలో ఆత్మోన్నతిని కలిగిస్తుంది.

జీవితంలో మానవుడు ఎన్నెన్నో గ్రంథాలను చదివి విజ్ఞానాన్ని సంపాదించుకోవచ్చు. ప్రకృతిని పరిశీలించి విజ్ఞానాన్ని ప్రవృద్ధి చేసుకోవచ్చు. స్వానుభవంతో విజ్ఞానాన్ని పెంచుకోవచ్చు. పెద్దల జీవితాలను, వారి అనుభవాలను పరిశీలించి విజ్ఞానాన్ని మరింత శోభాయమానం చేసుకోవచ్చు. కానీ ఎంత జ్ఞానం సంపాదించినా, ఏం లాభం? వివేకరహితమైన బుద్ధి ఆత్మ నాశనకరం. బుద్ధిమంతుడు ప్రజ్ఞాతిశయాన్ని ప్రకటించుకోలేడని కాదు. ఇవి స్వాతిశయాన్ని, అహంకారాన్ని పెంచుతాయి. వక్రించిన బుద్ధి లోకానికి అనర్థహేతువు. బుద్ధిబలం కేవలం స్వాతిశయాన్ని, ఆత్మవంచనను బలపరుస్తుంది.

జీవిత ప్రమాణం కాదు, జీవన ప్రమాణాభివృద్ధే విజ్ఞానంయొక్క పరమావధి.

"ఉన్నది మార్పు చెందక మానదు. అణువుకైనా

బుద్ధిబలం ఆత్మోన్నతికి సహకరించాలి. పరితాపంతో ఆత్మపరీక్ష చేసుకోవాలి.



చాలామంది జీవితంలో అసలు విషయాన్ని విస్మరిస్తారు. ఆత్మవంచనతో జీవిస్తారు. వివేక జ్యోతిని వెలిగించుకొని రత్నగర్భితమైన మహాసముద్రాన్ని వదిలి ఇసుకలో ముత్యపుచిప్పలు సంగ్రహిస్తారు. ధర్మాధర్మముల మధ్యనుండే సూక్ష్మతి సూక్ష్మమైన తారతమ్యాన్ని తెలుసుకోవాలి. ధర్మాభివృద్ధితో కూడిన విజ్ఞానం అవసరం.

భగవద్గీతలో, ఖురాన్‌లో, జెండ్ అవెస్తాలో ప్రపంచ వాఙ్మయంలో లేని వివేకం, విజ్ఞానం ఉంది. పాండవశ్రేష్ఠుడైన అర్జునుడు వేదశాస్త్రాలు చదివినవాడు, పుణ్యకర్మ నిరతుడు, పాపభీతి కలవాడు, స్వర్గనరకముల నిజతత్త్వమును తెలిసినవాడు, తనను చంపవచ్చిన వారినైనను అధర్మముగా చంపనివాడు. ధర్మం కొరకు తన ప్రాణాలను సహితం ఒడ్డువాడు. మమకార మోహితుడై యుద్ధాన్ని విరమించినప్పుడు శ్రీకృష్ణుడు చేసిన గీతోపదేశమే మనకుపదేశము, దివ్యోపదేశము.

## ప్రపంచంలో 6,40,000 పోస్టాఫీసులు

ప్రస్తుతం ప్రపంచంలో ఉన్న 6,40,000 పోస్టాఫీసులు 165 బిలియను ఉత్తరాలు, పోస్టుకార్డులను, 180 బిలియను వివిధ పత్రికలను చేరవేస్తాయి.

—వరల్డ్ పోస్టల్ యూనియన్, బెర్న్

(2 వ పేజీ తరువాయి)

లేక దైవం నిర్ణయించిన తీర్పే ఇదే ధర్మబద్ధమైనది. మానవమాత్రులు నిర్ణయించేది న్యాయబద్ధంగా ఉండదు. న్యాయాధికారులను, న్యాయనిర్ణేతలను బట్టి తీర్పులు మారుతూంటాయి, కానీ దైవనిర్ణయమైన తీర్పుకు మార్పు ఉండదు. ఈ సుస్థిరమైన దైవనిర్ణయ న్యాయం మీదే విశ్వం రసమయంగా విరాజిల్లు తూంటుంది. పరమసత్యం ఎప్పుడూ మారనిది. అది నిత్యం. అది నిర్వికల్పం.

అద్భుతమైన పారమార్థిక న్యాయం గణితశాస్త్రం వంటిది, రెండు రెండు కలుపుతే ఎప్పుడూ నాలుగే. తటస్థ లక్షణాలనుబట్టి, ప్రయోజనాలను, స్వరూప లక్షణాలనుబట్టి పరమార్థాన్ని అవగతం చేసుకో. విశ్వైక్యతకు దైవ నిర్ణయమైన న్యాయానుభవం కంటే వేరే సాధనలేదు.

# నవ్యకల్పనా చతురులు

## డా॥ అలెగ్జాండర్ గ్రహంబెల్

అలెగ్జాండర్ గ్రహంబెల్ 1876 లో టెలిఫోన్ సాధనాన్ని కనిపెట్టిన విజ్ఞానఘనుడు. బెల్ 1847 లో స్కాట్లండ్ ఎడిన్‌బర్గ్‌లో జన్మించాడు. ఇతడి తండ్రి అలెక్సాండర్ మెల్‌విల్లీ బెల్ మూగ, బధిరులకు విద్య నేర్పుతూండేవాడు. ఈ ఉద్యమంలో



ALEXANDER GRAHAM BELL

తండ్రికి సహకరించడానికి ఇతడు ఒక కోడ్‌ను కనిపెట్టి తయారు చేసాడు. దానికి విసిబిల్ స్పీచ్ (Visible speech) అని పేరు పెట్టాడు. మాట్లాడేటప్పుడు నాలుక, కంఠం, పెదిమలు పొందుతూన్న స్థితిగతులను నిర్ణయించి వ్రాసిపెట్టాడు. దీనిని ఇతడు ప్రత్యక్షంగా ప్రయోగంచేసి తండ్రికి ప్రదర్శించాడు. కొంతకాలానికి ఇతడికి శబ్దం, శబ్దప్రసారం గురించి తెలుసుకోవాలనే కుతూహలం బయలుదేరింది. ఎడింబరో మరియు లండన్ యూనివర్సిటీలలో ఇతడు విద్యను అభ్యసించాడు. జర్మనీ వుర్జ్‌బర్గ్ యూనివర్సిటీలో పి. హెచ్. డి. పట్టాన్ని సంపాదించాడు.

అనారోగ్యంతో బాధపడుతున్న బెల్ ఆరోగ్యాభివృద్ధి కొరకు 1870 లో ఇతడు కుటుంబంతో కెనడా ఒంటారియోకి కాపురం మార్చాడు. 'విసిబిల్ స్పీచ్' నేర్పించడానికి బెల్ యునైటెడ్ స్టేట్స్‌లో బోస్టన్‌కు వెళ్ళాడు. అక్కడ గార్డినెర్ గ్రీన్ హుబ్బర్డ్ మూగ కుమార్తె మేబెల్‌కి మాట్లాడడం నేర్పాడు. ఆతరువాత ఒక తీగగుండా టెలిగ్రాఫ్ వార్తలను ప్రసారం చేయడానికి ప్రయోగాలు చేసాడు. ఇతడి ఈ ప్రయోగాలకు హుబ్బర్డ్ కావలసిన ఆర్థిక సహాయం చేసాడు.

చిన్న లోహపు ముక్కలను కంపింపజేసి ఈ కంపనలవల్ల జనించే ఉచ్ఛ, నీచస్థాయి శబ్దాల ప్రసారాన్నిబట్టి వివిధ వార్తలను వేరుచేయుటకు ప్రయత్నించాడు. జూన్ 2, 1875 న బెల్‌కు సహాయకుడుగా ఉన్న థామస్ ఎ. వాట్సన్ అకస్మాత్తుగా ఒక లోహపుముక్కను ధ్వనింపజేసాడు. ఈ ధ్వని మరియొక గదిలో పనిచేస్తూన్న బెల్‌కి తీగద్వారా వినిపించింది. ఇదే వీరు కనిపెట్టిన నూతన ప్రక్రియకు ఉత్సాహాన్ని ప్రవృద్ధిచేసింది. ఈ విధానంలో మాటలను ప్రసారం చేయడానికి ఇద్దరూ ప్రయత్నాలు కొనసాగించారు.

"ముఖస్తుతి చేసేవాళ్ళు తాము పొగిడే

మార్చి 7, 1876న బెల్ తన సాధనాన్ని పేటెంట్ చేయించాడు. మూడురోజుల తరువాత అకస్మాత్తుగా ఒకసారి బెల్ బట్టలమీద బాటరీ ఆసిడ్ పడింది. వెంటనే వాట్సన్ 'నీవు ఒక్కసారి ఇలారా' అన్న బెల్ మాటలు తీగ ద్వారా అతడి అనుచరుడికి వినపడింది. టెలిఫోన్ ప్రారంభమైంది.

1877 లో ఇతడు బెల్ టెలిఫోన్ కంపెనీ స్థాపించాడు. ఆనాడు ఇతడు కనిపెట్టిన టెలిఫోనుకి చెవిదగ్గర పెట్టుకునే 'ఇయర్ పీసెస్' మాత్రమే ఉండేవి. అవే ఒకటి మైక్రోఫోనుగాను, రెండవది లౌడ్‌స్పీకర్ గాను ఉపయోగపడ్డాయి. దీనిపై గణించిన లాభాలను ఇతడు 'బధిరత్వాన్ని' గురించి చేసే పరిశోధనలకు వెచ్చించేవాడు.

బెల్ మొదట కనిపెట్టిన టెలిఫోన్‌కు అంత ప్రసిద్ధి రాలేదు. ఫిలడెల్ఫియా (యుఎస్ఎ) ఎక్స్‌పొజిషన్‌కు వచ్చిన బ్రెజిల్ చక్రవర్తి పెడ్రో టెలిఫోను రిసీవరు తీసి 'టు బి ఆర్ నాట్ టు బి' అనే వార్త మొట్టమొదట విని భయంతో ఫోన్‌ను క్రిందికి జారవిడిచాడు.

ప్రసిద్ధ వైజ్ఞానిక శాస్త్రజ్ఞుడు లార్డ్ కెల్విన్ అమెరికాలో అతడు చూసిన టెలిఫోను అద్భుతమైనదని చెప్పాడు. బెల్ ప్రయోగం చేసిన తరువాత ఇంగ్లండులో క్వీన్ విక్టోరియా మహారాణి తన స్వంత ఉపయోగానికి ఒక టెలిఫోను జత వాడింది.

బెల్ యునైటెడ్ స్టేట్స్ వాస్తవ్యుడై వాషింగ్‌టన్‌లో స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. ఆగస్టు 2, 1922లో ఇతడు కెనడా నోవా స్కోటియాలో స్వంత ఇంటిలో మరణించాడు. మరణించడానికి ముందు ఇతడు కనిపెట్టిన టెలిఫోన్ ప్రపంచం అంతటా ఏర్పాటుచేయబడింది. కాలక్రమేణా మన జీవితంలో టెలిఫోన్ ప్రభావం తీవ్రతరమైంది.

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తుగా ఉండే స్మృతి చిహ్నం



యుఎస్ఎ మిస్సోరీలో సెంట్ లూయిస్ లోని ఎవర్ స్టీల్ ఆర్చి ప్రపంచంలో మిక్కిలి బ్రహ్మాండమైనది. ఇది స్టెయిన్‌లెస్ స్టీలుతో 2,90,00,000 డాలర్ల ఖర్చుతో అక్టోబరు 28, 1965 లో పూర్తి చేయబడింది. 630 అడుగుల ఎత్తు ఉండే ఈ స్మృతి చిహ్నం 1803 లో తెల్లజాతుల పశ్చిమ దిక్కు ఆక్రమణ జ్ఞాపకార్థం నిర్మించబడింది. దీనిని ఈరో సారినెన్ రూపకల్పన చేసాడు.

# సీతాఫలము

భారతీయ జీవిత విధానంలో రామాయణ ప్రభావం చాలా అధికంగా ఉంది. వ్యవసాయ రంగంలో కొన్ని జాతుల పళ్ళకు సీతా, రామ, లక్ష్మణ. హనుమాన్ పేర్లు పెట్టారు. ఈ ఫలజాతులలో చాలా ప్రసిద్ధి పొందినది సీతాఫలము. ఇతర రామ,



లక్ష్మణ, హనుమాన్ ఫలాలు అంత ప్రసిద్ధి చెందకపోయినా కొన్ని కొన్ని ప్రాంతాలలో వీటిని పెంచి రుచిగా ఆదరణీయంగా తింటారు. ఇవి ఏ ప్రదేశాలలోనైనా సుల భంగా పెరగడం చేతను, పుష్టికరమైనవి అగుటచేతను, చౌకగా దొరికేవి అగుటచేతను బీదసాదలు అందరూ ఉపయోగిస్తారు.

ఈ జాతి అన్నోనా (Annona) కుటుంబానికి చెందినది. వీటిలో 70 కంటే అధికంగా ఉపజాతులు ఉన్నాయి. కాని భారతదేశంలో పై నాలుగు రకాలే ఉన్నాయి.

ఈ జాతి చెట్లు పొడిగా ఉండే ఉష్ణప్రదేశపు వాతావరణంలో బాగా పెరుగుతాయి. ఎక్కువ సారవంతంగాని ఇసుక ప్రదేశాలలోను, రాతినేలలోను కూడా ఇవి బయల్పడతాయి. భారతదేశంలో సుమారు 50,000 హెక్టేరుల ప్రదేశంలో ఇది సాగుబడి చేయబడుతూంది.

అన్నోనా కుటుంబంలో సీతాఫలం చాలా ప్రసిద్ధిపొందినది. దీనిని అ న్నో నా స్క్వామోసా (Annona squamosa) అంటారు. ఇది సాధారణంగా 15 మొదలు 20 అడుగులు ఎత్తుగా పెరిగే చెట్టు. ఈ చెట్టు కలపకు సాధారణంగా పురుగు పట్టదు. చెద తినదు. అందుచేత గ్రామాలలో బండ్ల భాగాల తయారీకి, ఇంటి కప్పులకు దీని కర్రను ఉపయోగిస్తారు.

దీని ఆకులలోను, కాండంలోను లభించే అన్నోనైన్ (Annonaine) అనే పదార్థం దీనికి చేదు కలిగిస్తుంది. అందువల్లే ఈ చెట్లను పశువులు, మేకలు, ఇతర జంతువులు తినవు. కాబట్టి వీటిని సాధారణంగా కంచెలు వేయడానికి ఉపయోగిస్తారు.

సీతా ఫలాన్ని కస్టర్డ్ ఆపిల్, స్వీట్ ఆపిల్, షరీఫా అంటారు. సీతా ఫలంలో

## సంవత్సరంలో 16 మిలియను మెరుపులు

ప్రతి సంవత్సరంలో 16 మిలియను మెరుపులు సంభవిస్తాయి. వీటివల్ల 100 మిలియను టన్నుల ఎరువులు ఏర్పడి వానలో కరిగి భూమిలో చేరుతున్నాయి.

"అసమర్థులు కాచుకుని ఉండే అవకాశాలే ..."

అనేక రకాలు ఉన్నాయి. ఎరుపు, నీలం కలిసిన రంగు చర్మము గల ఎర్ర సీతాఫలము, తెల్లని కండ్లుగల 'మామ్మాత్', ముదురు ఆకుపచ్చ రంగు 'బాలనగర్' ముఖ్యమైనవి. లోపల నల్లటిగింజలు విస్తారంగా ఉంటాయి. వీటి చుట్టూ తియ్యని తెల్లని గుజ్జు ఉంటుంది. దీంతో రుచికరమైన జామ్‌కూడా తయారు చేస్తారు. కొన్ని చోట్ల ఈ పండ్లరసంతో సారాకూడా వండుతారు. 10 లేక 12 గింజలు మాత్రమే ఉండే మంచిరకపు పండ్లను మెదక్ జిల్లా, జంగారెడ్డి వ్యవసాయ పరిశోధక కేంద్రంలో అభివృద్ధి చేసారు.

సీతాఫలంలో చక్కెర, ప్రొటీనులు, ఖనిజాలు సమృద్ధిగా ఉంటాయి సీతాఫలంనుండి తీయబడిన ఆల్కహాల్‌ను అనోకోరిన్ (Anocorin) అంటారు. దీనికి క్రిమినాశక గుణం ఉంది. అనేక ఔషధాల తయారీలో దీనిని ఉపయోగిస్తున్నారు. సీతాఫలం గింజల నుంచి తీసిన తైలానికి కూడా క్రిమినాశక గుణాలు ఉన్నాయి. సీతాఫలంలో గింజల వల్ల 30 శాతం తైలం లభిస్తుంది. చెట్టు ఆకులు, కొమ్మలు, బెరడు, వేళ్ళు, పళ్ళు మొదలైన వివిధ భాగాలకు ప్రత్యేక ఔషధ గుణాలు ఉన్నాయి.

హనుమాన్ ఫలం కర్ణాటకాలో పర్వత ప్రాంతాలలోను, శ్రీలంకా, ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే పెరుగుతుంది. ఇటీవల హైదరాబాద్‌లో దీనిని విస్తారంగా పండిస్తున్నారు. హనుమాన్ ఫలం చాలాపెద్దదిగా ఉంటుంది. మంచి రుచిగా ఉంటుంది. గింజలు చాలా తక్కువగా ఉండి గుజ్జు అధికంగా ఉంటుంది.

రామాఫలము మానవ హృదయం ఆకారంలో ఉంటుంది. పసుపు, ఎరుపురంగు తొక్క గలిగి ఉంటుంది. పశ్చిమ బెంగాల్‌లో దీనిని నోనా (Nona) అంటారు. వ్యాపార రీత్యా దీనికి అంత ప్రసిద్ధిలేదు. అందుచేత దీనిని విస్తారంగా పండించరు. అంత రుచిగా ఉండకపోవడమే దీనికి కారణము. తొక్క మీద ముళ్ళుండే పనసపండు లాంటి నాపి రకం ముండ్ల సీతాఫలం అస్సాంలోను, బర్మాలోను ఎక్కువగా పండుతుంది. దీంతో షర్బత్తులు తయారుచేస్తారు.

(మిగతా 12 వ పేజీలో)

## సియామీస్ ట్విన్స్ ఎవరు?



ఎంగ్ మరియు చాంగ్ (1811-1874) థాయిలాండ్ సియామ్‌లో జన్మించిన కవలలు. వీరు నడుం దగ్గర కలిసిపోయి పుట్టారు. ఈ కవలలను అనుసరించే ఇప్పుడు వెన్నుపూస క్రింది భాగం దగ్గర చేరిపోయి పుట్టిన వారిని "సియామీస్‌ట్విన్స్" అంటారు. ఒక్కొక్కప్పుడు శస్త్రచికిత్స సహాయంతో సియామీస్ కవలలను విడదీయవచ్చు. కానీ ముఖ్యమైన అవయవాలవద్ద చేరిపోతే విడదీయడం శ్రేయస్కరం కాదు.

"ప్రార్థనచేసే పెదిమలకన్నా, చేయూతనిచ్చే చేతులు గొప్పవి."

# ప్రపంచ నగరాలు

## సా ఓ పాలో

దక్షిణ అమెరికా బ్రెజిల్‌లో సావోపాలో రాజధాని నగరం సావోపాలో. ఇక్కడ 7 మిలియను మంది జనం నివసిస్తారు. ప్రతీ సంవత్సరం ఒక మిలియను మంది పర్యాటకులు ఈ నగరాన్ని సందర్శిస్తారు. నగ


Sao Paulo

రంలో వీరికి 270 హోటళ్ళు, 500 సినిమాలు విలాసం వినోదం కలిగిస్తాయి. అతి శీఘ్రంగా ఇంత ప్రవృద్ధి ఇక్కడ జరిగిందంటే ఆశ్చర్యం కలుగక మానదు. 1810 లో ప్రవృద్ధిలేని ఈ చిన్నగ్రామంలో 7000 మంది నివసించేవారు.

నేటికీ ఇక్కడ బైజాంటైన్ సాంప్రదాయంలో పెద్ద పెద్ద రాళ్ళతో నిర్మింపబడిన ఫ్రాన్‌సిస్కన్ కాన్వెంటు, అందమైన చర్చీలు ఉన్నాయి. ఇక్కడ 1554 లో జెస్యూయిట్లు నిర్మించిన పాత చర్చి చారిత్రక స్మృతి చిహ్నంగా రక్షింపబడుతూంది. ఇప్పుడు బ్రహ్మాండమైన ఆధునిక భవనాలు సావోపాలోలో నిర్మింపబడ్డాయి. ప్రపంచంలో అన్ని ప్రదేశాలనుండి అనేకమంది సాంకేతిక, వైజ్ఞానిక సాహసోద్యమశీలురు ఇక్కడ నిర్వహింపబడే ఇండస్ట్రియల్ ఫెయిర్స్ సందర్శిస్తారు.

అపూర్వ ప్రాచీన వస్తువులు, చిత్రాలు సావోపాలో ఆర్ట్‌మ్యూజియంలో భద్రపరచబడి ఉంటాయి. సుప్రసిద్ధ వాన్‌గోగ్, పికాస్సో, రెనాయిర్, రెంబ్రాన్ట్‌డ్, టౌలౌస్ మొదలైన చిత్రకళోపాసకులు చిత్రించిన చిత్రాలు ఇక్కడ ఉంటాయి. సేక్రెడ్ ఆర్ట్ మ్యూజియంలో మతసంబంధమైన కళా వస్తువులు పదిలపరచబడ్డాయి. కాసాడో బాండియరాంటే 17 వ శతాబ్దంలో నిర్మింపబడిన గృహనమూనాను తెలియజేస్తుంది. ఇచట భద్రపరచబడినవన్నీ ప్రామాణికమైనవి. ఇక్కడి ఇన్‌స్టిట్యూట్ బుటాంటాలో 33,000 రకాల పాములు, స్పైడర్లు ఇంకా అనేకరకాల విషజంతువులు ప్రదర్శింపబడతాయి.

పార్ ఖె అన్‌హెంబే ప్రపంచంలో మిక్కిలి పెద్ద ప్రదర్శనశాల ఇక్కడి మరియొక ముఖ్య ఆకర్షణ. లాటిన్ అమెరికా ముఖ్యపారిశ్రామిక ప్రదర్శనలు ఇక్కడే నిర్వహింపబడతాయి. ఇచ్చట 'జూ'లో ప్రపంచంలో గల జంతువులన్నీ ఉంటాయి. సావోపాలోలో పెద్ద పెద్ద మైదానాలతో, మ్యూజియములతో, స్మారక భవనాలతో

(మిగతా 13 వ పేజీలో)

"మనిషిని సంస్కారవంతుణ్ణిచేసే చదువే చదువు."

# షిరిడీ సాయిబాబా

శ్రీ హెచ్. హెచ్. నరసింహస్వామిజీ

శ్రీ సాయిబాబా గొప్ప దివ్యాంశ సంభూతుడు. 'పరమజ్ఞాని', 'అవతార' పురుషుడు. పూర్వం నైజాం నవాబు పాలనలో ఉన్న హైదరాబాదుకు చెందిన "పత్రి" అనే గ్రామంలో బాబా ఒక సామాన్య బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. చిన్నప్పుడే




బాబాని ఒక ముస్లిం ఫకీరు వద్ద వదలిపెట్టారు. కానీ కొద్ది సంవత్సరాలకి గోపాలరావు దేశ్‌ముఖ్ అనే సిద్ధ వెంకుశగురు సంరక్షణలోకి వచ్చారు. బాబా ఇక్కడ భక్తి శ్రద్ధలతో గురువుగారికి సేవలు చేస్తూ వారి అనుగ్రహంతో 'ప్రేమమార్గం' లో ప్రగతిపూర్వకమైన లక్ష్యసిద్ధిని పొందారు. అప్రయత్నంగా బాబా అనేక అపూర్వ సిద్ధులు, దివ్యమహిమలు ప్రదర్శించేవారు.

బాబా యౌవ్వనంలోనే గురువుగారు మరణించారు. ఆ తరువాత బాబా ఫకీరుగా తిరగడం ప్రారంభించారు. అనేక ప్రదేశాలు సందర్శించి 16 వ సంవత్సరం వయస్సులో షిరిడీ చేరుకున్నారు. కొంతకాలం పాటు ఇక్కడ సుస్థిరంగా ఉండి తిరిగి ఫకీరుగా తిరగడం మొదలు పెట్టారు. 20 వ సంవత్సరం వయస్సులో తిరిగి షిరిడీ వచ్చి భౌతిక శరీరాన్ని వదిలేదాకా అక్టోబరు 15, 1918 వరకు అక్కడే ఉండిపోయారు. షిరిడి మహారాష్ట్ర అహమ్మద్ నగర్ జిల్లా కోపెర్‌గోన్ తాలూకాలో రాహటా అనే గ్రామం దగ్గర చిన్న పల్లె.

## వినదమ్ పాతకాపీలు

ఫిబ్రవరి '83; మార్చి '84, మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచి నవంబరు 84; జనవరి 85, మార్చి '85 నుంచి అక్టోబరు '85; జనవరి '86 నుంచి డిసెంబరు '86; జనవరి '87 నుంచి డిసెంబరు '87; జనవరి '88 నుంచి డిసెంబరు '88 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీవెల పై 0.75; 1984 కాపీల వెల రూ. 8.75 లు; 1985 కాపీలవెల వెల రూ. 11.50 లు; 1986 కాపీల వెల రూ. 18.25 లు; 1987 కాపీల వెల రూ. 18.00 లు; 1988 కాపీల వెల 20.25 లు. రిజిస్టర్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 5.00 లు చేర్చి M.O. పంపాలి. 'వినదమ్', 9, దేశికారోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

—సర్క్యులేషన్ మేనేజర్

"క్రొత్త వైద్యునికన్న పాతరోగి మేలు."

బాబా మొట్టమొదట షిరిడీ చేరినప్పుడే ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని పొందారు. ఎండనక, వాననక ప్రాపంచిక సుఖాలను లెక్క చేయకుండా ఒక వేపచెట్టు క్రింద నివసిస్తూ నిష్ఠమెత్తుకుంటూ దొరికినప్పుడు తింటూ, లేనప్పుడు పస్తుండేవారు. ఈ విధంగా బాబా వాస్తవమైన సన్యాసి జీవితం జీవించేవారు.



బాబా వేపచెట్టును వదలి దగ్గరలో ఉన్న మసీదులో మకాం పెట్టారు. ఏకాంత జీవితాన్ని జీవించేవారు. జన సమూహంలో ఎప్పుడూ చేరేవారు కాదు. సన్యాసులతో, ఫకీరులతో, భక్తులతో కాలం గడుపుతూండేవారు. అయినా తోచినప్పుడు ఉచితంగా తన మందులనిచ్చి రోగులకు చికిత్సచేస్తూ, వారికి ఆరోగ్యం చేకూరుస్తూండేవారు.

ఊరిలో అనేకమంది బాబాని ఒక ఫకీరుగా నిర్లక్ష్యం చేస్తూండేవారు. సామాన్యంగా మసీదులో దీపాలు వెలిగించడానికి చుట్టుపక్క కొందరు నూనె ఇవ్వడం వాడుక. ఒకరోజున వారు నూనె ఇవ్వడం మానేసారు. బాబా విచారించలేదు. దీపాలలో నూనెకు బదులుగా నీళ్ళుపోసి వత్తులు వేసి వెలిగించారు. ఆశ్చర్యం! రాత్రంతా దివ్యకాంతితో దీపాలు వెలిగాయి. గ్రామస్థులు ఇది గ్రహించి ఆశ్చర్యపడిపోయారు.

బాబా హరినామ జపం చేస్తూండగా ఒకనాడు సాక్షాత్తు భగవంతుడు హరిరూపంలో ప్రత్యక్షమైయాడు. బాబా జీవితంలో వింత మార్పు సంభవించింది. ఆనాటినుంచి బాబా మందులు ఇవ్వడం మాని, మందులకు బదులుగా 'ఊది' ఇవ్వడం ప్రారంభించారు. మసీదులో నిత్యాగ్నివల్ల ఏర్పడిన భస్మం 'ఊది'. రోగులు విశ్వాసంతో ఈ భస్మాన్నే నాలుక మీద వేసుకుని శరీరానికి రాసుకునేవారు. రోగాలు కుదిరేవి. నిర్భయంగా, సంతోషంగా ఉండేవారు. సంశయాలు తీరిపోయేవి.

1892 నాటికి బాబా మహిమలు విన్న ఆ జిల్లా కలక్టరు పర్సనల్ అసిస్టెంటు నారాయణ గోవింద్ చందోర్కార్, అతడి పోలీసు ఆర్డర్లీ గణపత్‌రావు దత్తాత్రేయ సహస్రబుద్ధే బాబా దర్శనం చేసుకున్నారు. బాబా సామాన్య నిరాడంబర జీవితానికి, మహిమలకు, అతడి పవిత్రమైన జీవితానికి, ప్రేమానురాగాలకు ఆశ్చర్యాన్ని ప్రకటించి, బాబా మహిమలకు తగిన ప్రచారం కలిగించారు. 1908 నుండి షిరిడీ ఒక సుప్రసిద్ధ యాత్రాస్థలంగా మారిపోయింది. అనేకమంది భక్తులు జాతి, మత, కుల విభేదం లేకుండా శ్రీమంతులు, దరిద్రులు, గొప్ప తక్కువ భేదం లేకుండా, ఉన్నతాధికారులు, సామాన్య ఉద్యోగులు, పల్లెటూరివాళ్ళు, నగరవాసులు,

"బంగారు పళ్ళానికైనా గోడచేర్పు అవసరం."

దొంగలు, దొరలు బాబా దర్శనం చేసుకోడానికి వచ్చేవారు. భక్తి. భగవన్నామ ప్రచారం చేసిన సిద్ధపురుషులు బాబా. ఇతడి మహిమల వల్ల ప్రజలకు ఒక లక్ష్యం ఏర్పడింది. బాబా సశరీరంతో భక్తులకు ప్రసన్నుడై వారి తాప త్రయాలను తీర్చేవారు. అదేవిధంగా నేటికి శ్రీ బాబా దివ్యాత్మ చైతన్యవంతమై ప్రకాశిస్తూ భక్తులకు మార్గదర్శకంగా ఉంటూంది.

తాను సాయి శరీరానికి చెందినవాడు కాదని ప్రతిచోటా, ప్రతి వస్తువులో, ప్రతి ప్రాణిలో తాను ఉన్నట్లు వ్యక్తులను విశ్వసింప చేసారు. అనేకమంది భక్తులు సాయి స్వరూపాన్ని ప్రత్యక్షం చేసుకున్నారు. సర్వాంతర్యామియైన బాబా షిరిడీలో మట్టితో చేరిపోయిన భౌతిక కాయముకాదు. సాయి పవిత్ర ఆత్మ. అనేకసార్లు భక్తులు సాయి ఫోటో సజీవంగా, చైతన్యవంతమైనదిగా చూడగలిగారు. హైందవ భక్తులకు బాబా ఒక ప్రత్యక్షదైవము. భక్తులు తమ తమ జీవితాలలో ప్రతిక్షణం అడుగు అడుగున సాయి చైతన్యతను అనుభవిస్తున్నారు.

బాబా అన్ని మతాలను సమానంగా గౌరవించారు. 'ఫాతిహా' (Fatiha) చెబుతూ మహమ్మదీయులు ఖురాన్ పఠిస్తూంటే దీక్షగా వినేవారు. హిందువులకు రామమంత్రం చెబుతూ గీతను ఉపదేశించేవారు. బాబా ఏ మతానికి చెందని విశ్వైక మతాభిమాని. బాబా మసీదులో నేటికీ 'నింబార్' ఉంటుంది. మహమ్మదీయులు ప్రార్థనలు సలుపుతారు. హిందువులు, పార్శీలు ప్రార్థిస్తారు. దగ్గరలో పవిత్రమైన తులసి బృందావనం ఉంది. బాబా ఆదేశాన్ని అనుసరించి ఇక్కడ ప్రతిరోజూ పురాణ ప్రవచనాలు జరుగుతాయి. దివ్య ప్రబంధాలు, ఆధ్యాత్మిక గ్రంథాలు పఠింపబడతాయి. ముస్లిములు ఖురాన్ షారియాట్ పఠిస్తారు.

భక్తిమార్గంలో సేవతోకూడిన ప్రేమే శ్రీ సాయిబాబా ముఖ్యోద్దేశము. సాకారమో, నిరాకారమో భగవంతుని సాక్షాత్కరింపజేసుకుని ఆత్మానుభూతిని పొందడమే వీరి ఉపదేశ లక్ష్యము.

—'ఆల్ ఇండియా సాయి సమాజ్'
సౌజన్యంతో

## అమెజాన్ నదీ లోయలో 2,000 రకాల చేపలు




ప్రపంచంలో భూమి మీది చెట్లవల్ల లభించే ప్రాణవాయువులో సగానికి సగం అమెజాన్ నదీలోయలో చెట్లు, ఇతర వృక్ష సంపదవల్ల ఉత్పాదింపబడుతూంది. ఇచ్చటి 2,000 జాతుల చేపలు, అట్లాంటిక్ మహాసముద్రంలో ఉన్న వాటికంటే చాలా అధికం.

"సాహసంవల్ల కొందరికి అదృష్టం పట్టినా,
చాలామందికి దురదృష్టం పట్టుకుంటుంది."

# అక్కడా-ఇక్కడా

## ద్రాక్షలో క్రొత్త రకాలు:

ఇండియన్ అగ్రికల్చరల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన హార్టికల్చరల్ టెక్నాలజీ విభాగం వారు రెండు క్రొత్త



ద్రాక్షరకాలను అభివృద్ధి చేసారు: ఈ పళ్ళు అతిశీఘ్రంగా పెరుగుతాయి. వీటిలో కరిగే పోషకపదార్థాలు అధికంగా ఉంటాయి: పళ్ళు ఒకే పరిమాణంలో ఉంటాయి. ఇవి తిన డానికి, ఇతర పండ్లు నిల్వపరిశ్రమలకు వినియోగపడతాయి.

## అంతరించిపోయిన 'మౌనాయ్‌కీ' అగ్నిపర్వతంమీద బ్రహ్మాండమైన దూరదర్శిని:

పసిఫిక్ మహాసముద్రంలోని హవాయ్‌లో అంతరించి పోయిన మౌనాయ్‌కీ అగ్నిపర్వతంమీద బ్రహ్మాండమైన దూరదర్శిని నిర్మింపబడుతూంది. 87 మిలియను డాలర్ల వ్యయంతో నిర్మించబడే ఈ దూరదర్శిని పూర్తి అయితే సుప్రసిద్ధ ఖగోళశాస్త్రజ్ఞులు విశ్వం ఉత్పత్తిని సునిశితంగా పరిశీలించడానికి వీలు కలుగుతుంది. ఇది యు ఎస్ ఏ కాలిఫోర్నియాలోని పాల్‌మార్ పర్వత శిఖరం మీద ఉన్న దూరదర్శినికి రెండింతలు పెద్దదిగా ఉంటుంది. యు ఎస్ ఎస్ ఆర్ కాకసస్‌లో పస్టుకోవ్ పర్వత శిఖరంమీద ప్రస్తుతం ప్రపంచంలో మిక్కిలి పెద్ద దూరదర్శినిని మించిపోయి ఉంటుంది.

## బిసి 6వ శతాబ్దానికి చెందిన పురావస్తువులను కనుగొన్నారు:

భూగర్భ శాస్త్రపరిశోధకులు ఉత్తర ప్రదేశ్‌లో అహిచ్చాత్రా (నేటిరామ్‌నగర్) దగ్గర బిసి 6వ శతాబ్దానికి చెందిన గౌతమ బుద్ధునికి పూర్వకాలపు పురావస్తువులను కనుగొన్నారు.

( 7 వ పేజీ తరువాయి)

సీతాఫలంలో విటమిను 'C' సమృద్ధిగా లభిస్తుంది. కాల్షియం, ఇనుము కూడా ఉంటాయి. రామాఫలంలోను, హనుమాన్ ఫలంలోను కూడా ఇవి లభిస్తాయి. రామాఫలంలో విటమిను 'ఎ' కు సంబంధించిన 'బి' కెరొటీన్ అదనంగా ఉంటుంది. ఈ పళ్ళలో గుజ్జు సులభంగా జీర్ణం అవుతుంది. పిల్లలు, వృద్ధులు కూడా దీనిని వాడవచ్చు. పాలు మాని గట్టి ఆహారం తినిపించే పిల్లలకు ఆహారంలో దీనిని కలిపి తినిపించవచ్చు.

—'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

"ఇతరులలో ఒక పొరపాటును గమనిస్తే నీలోని రెండు పొరపాట్లను గుర్తుచేసుకో."

బల్గేరియాలో మొత్తం శ్రామిక శక్తిలో 49-3 శాతం మహిళలే:

తూర్పు యూరప్ బల్గేరియాలో మొత్తం పారిశ్రామిక శక్తిలో 49.3 శాతం మహిళలది. పారిశ్రామిక సంస్థల ఉద్యోగాలలో



49.1 శాతం స్త్రీలది. తంతితపాలా, రాకపోకలు, వైజ్ఞానిక, సాంస్కృతిక, మరియు ఇతర సంస్థలలో మొత్తం 56 శాతం వీరే. వ్యాపారం, ఆరోగ్య రక్షణ, సాంఘిక భీమా మరియు ఆర్థిక రంగంలో మహిళలది 74 శాతం.

ఆసియాలో అతి ప్రాచీనమైన మిక్కిలి పెద్ద జైన విగ్రహం:

మధ్యప్రదేశ్‌లో బా వ ం గ జా దగ్గర సాత్పూరా పర్వతశ్రేణిలో ఆసియాలో అతి ప్రాచీనమైన మిక్కిలి పెద్ద జైనవిగ్రహం ఉంది. 84 అడుగుల ఎత్తుగల ఈ ఋషభదేవ విగ్రహానికి 14 సంవత్సరాల కొకసారి మస్తకాభిషేకం జరుగుతుంది.

భారతదేశం పదవవంతు వర్ష పాతాన్నే వినియోగించుకుంటూంది:

ఇప్పుడు భారతదేశం పదవవంతు వర్ష పాతాన్నే వినియోగించుకుంటూంది. వర్షపు నీటిని వ్యర్థం కాకీయకుండా చిన్న చిన్న రిజర్వాయరులు. ఇతర నీటి విల్వ పదు పాయాల నిర్మాణంవల్ల సంవత్సరంలో పడే వర్షపాతం మన మంచినీటి అవసరాలను తీరుస్తుంది. —'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

( 8 వ పేజీ తరువాయి)

నిండిన పార్కు పార్క్ డొ ఇబిరాపూయేరా (parque do Ibirapuera).

1,20,000 ప్రేక్షకులకు అనుకూలంగా ఉండే మొరుంబీ (Morumbi) స్టేడియం లోను 70,000 మంది పట్టే పాకేంబూ (pacaembu) స్టేడియంలోను బ్రెజీలియన్ సోకర్ జట్టులు సోకర్ ఆడుతుంటారు. ఇంటర్‌లాగోస్ పందెపు బాటలో గ్రేట్ బ్రెజీలియన్ ఫార్ములాపంటి అనేక కారు పందాలు నిర్వహించబడుతాయి.

సావోపాలోకి 90 కిలోమీటర్ల దూరంలో సముద్రపు ఒడ్డున ఉన్న గౌరుజా ప్రసిద్ధి చెందిన సముద్ర తీరపు విడిది. 1700 మీటర్ల ఎత్తున ఉండే కాంపోస్ దోజోర్డాఒ ముఖ్య ఆరోగ్య కేంద్రం. ఇది సావోపాలోకి 184 కి.మీ. ల దూరంలో ఉంది.

"ధనం అనే ఆరవ 'ఇంద్రియజ్ఞానం' లేకుండా 'మిగిలిన పంచేంద్రియాలు పని చేయవు."

# ఔషధ ప్రపంచం

## సారా నిషాకు క్రొత్త సోవియెట్ మందు

సారా త్రాగుడు దురలవాటువల్ల ప్రతీ సంవత్సరం 500 బిలియన్ డాలర్లు వ్యయం చేస్తున్నారని సారా త్రాగుడు నివారణ మరియు చికిత్సకై ఏర్పాటైన మాస్కో-రౌండ్ టేబిల్ సమావేశంలో సభ్యులు తెల్పారు. న్యూరో పెప్టైడ్స్ (Neuropeptides) అనే క్రొత్త సోవియెట్ మందు సారా త్రాగుడువల్ల కలిగే నిషాను, సారా అలవాటును కూడా పోగొడుతుందని అంటున్నారు.

* * *

## పేరుకుపోయిన రక్తపు కదుపులను తీయడానికి క్రొత్తవిధానం

సోవియెట్ యూనియన్ లాట్వియన్ న్యూరోవెసల్ సెంటర్ వైద్యులు రక్తనాళాలలో పేరుకుపోయిన రక్తపు కదుపులను (blood clots) తీయడానికి క్రొత్త విధానము కనిపెట్టారు. అపాయస్థితిలో ఉన్న వారికి ఇది అమోఘంగా పనిచేస్తుంది. ఇటీవల పుత్రి క్రిందిభాగంలో ఈ విధానాన్ని విజయవంతంగా ఉపయోగించారు. రక్తనాళం గుండా రెండు గొట్టాలకు చిన్న చిన్న బెలూనులు అమర్చి అడ్డు ఏర్పడిన ప్రదేశాలకు పంపారు. సుమారు 3 గంటలసేపు జరిగిన ఈ కార్యక్రమంలో ఎక్స్‌రే నియంత్రణవల్ల బెలూనులు కొట్టుకుంటూ కదుపుల మీద పడతాయి. ఈవిధంగా రక్తనాళం శుభ్రం చేయబడుతుంది. కదుపులు లాగి వేయబడతాయి

* * *

## కిడ్నీ రోగులకు క్రొత్త ప్రాణ రక్ష

కిడ్నీల మార్పిడి రోగుల ప్రాణరక్షణకు అవసరమైన ఎలాథియోప్రెయిన్ (Alathioprine) అనే క్రొత్తమందును బొంబాయి పెర్లె పరిశోధక మరియు అభివృద్ధి కేంద్రంలో శాస్త్రజ్ఞులు విజయవంతంగా సంయోగపరచారు. ఈ క్రొత్త మందు శరీరం విధానంలో అంగ మార్పిడి నిరాకరణ ప్రక్రియను ప్రబలకుండా చేస్తుంది.

## 2000 ఎ. డి. కి భారతదేశంలో 279 మిలియను పిల్లలు ఉంటారు



2000 ఎ. డి. కి భారతదేశంలో చిన్న పిల్లల సంఖ్య 279 మిలియను ఉంటుంది. జనాభా లెక్కల ప్రకారం ఇది 1991 లో భారతదేశం జనాభా.

"ఉత్తమస్థితిని కోరుట అభ్యుదయేచ్ఛ, దానిని పొందుటయే విజయం."

# రాతి మనసు

శ్రీ కుమార్ వర్మ

ఏదో సమస్యతో తిప్పలు పడిపోతున్నావు.

సంశయం తీర్చుకుని సమస్య సాధించేద్దామని గవర్నమెంటు ఆఫీసుకు వెళతావు. నీవు చూడదలచుకున్న ఉద్యోగి అయిదు వ్రేళ్ళతో తీసుకున్న పచ్చి చెక్కను తల ఎత్తి తెరచిన నోటిలో దులుపుకుని సున్నం



రాసి రెండు ఆకులకు తొడిమలు తుంపి నోటిలో కుక్కుకుని ఎడమచేతి అరచేతిలో పొగాకు సున్నం పొడిచేసి కుడిచేతితో నోటిలో వేసుకుని నములుతూ కూర్చుంటాడు.

ప్రారంభమవుతుంది అసలు నాటకం. అధికార గర్వం, గొప్పతనం. అధికంగా దుర్వినియోగం చేయబడుతూన్న బ్యూరోక్రసీ. బద్ధకానికి, జడత్వానికి ఇది మారు పేరు అని చెప్పుకోవచ్చు.

బల్లప్రక్క కుర్చీలో ఉద్యోగి ఉమ్మితో నిండిన నోరు పైకెత్తి నములుతూ తల ఆడిస్తాడు. నీ సమస్య తెలియజేయాలని ఆతృతతో చెప్పుకు వస్తావు. ఏం లాభం. రాళ్ళు కఠినంగా ఉంటాయి. చెక్కి శిలా ప్రతిమలు తయారుచేస్తారు. ఉక్కు [illegible] కంటే కఠినం. కఠినాతికఠినమైన ఉక్కుని కావలసిన రూపంలోకి కాల్చి వంచుతారు. కానీ హృదయ కాఠిన్యం ఎంత కఠినమో: ఆ ఉద్యోగి సమస్య అసలు కాలం ఎలా వెళ్ళబుచ్చుదామా అని. ఎప్పుడు 5 గంటలు కొడుతుందా అని గడియారం చూస్తుంటాడు. ఇంటికి వెళ్ళిపోదామనే తొందర. నీ పని నీవు చేయించుకోడానికి ప్రభుత్వానికి నీవు డబ్బు చెల్లించడం లేదూ: కాళ్ళావేళ్ళాబడి ప్రొక్కుకోడం ఎందుకు: లంచం ముట్టచెప్పడం ఎందుకు: నిజంగా జరిగేదే అంతా: నీవు ఎక్కడికి వెళ్ళినా సరే ఒకటే కథ.

## ఎలా?

### "యుడికలోన్" జ్వర తీవ్రతను ఎలా తగ్గిస్తుంది?

యుడికలోన్ జ్వరంతో బాధపడే రోగుల కణతలకు రాస్తారు. ఇది రాయడంతోనే హరించిపోవడంవల్ల ఆవిరై పోతుంది. ఈ విధంగా ఆవిరయ్యేటప్పుడు అది శరీరంలో ఉండే ఉష్ణాన్ని గ్రహించేస్తుంది. దాని ఫలితంగా రోగి ఉష్ణోగ్రత బాగా తగ్గిపోతుంది. ఈ విధంగా అది జ్వర తీవ్రతను తగ్గిస్తుంది.

"ప్రార్థనలో మాటలకన్నా ముఖ్యమైనది మనసు."

పరోపకార బుద్ధి ఉండదు. దుర్నీతి, మోసం, నిర్లక్ష్యం, ఉదాసీనత, మొరటుతనం వగైరా ప్రబలిపోయాయి.

ఈ పాషాణ హృదయత ఒక్క ఆఫీసులోనే లేదు. ఆదరాభిమానాలకు, పెట్టుపోతలకు, ధార్మికబుద్ధికి, అనంతమైన సాంస్కృతికాభ్యున్నతికి పేరు పొందిన భారతదేశంలో క్రమక్రమంగా ప్రతిచోటా ఈ మొండితనం ప్రభవిస్తూంది. ఒక వ్యక్తి చికాకుతో విసుక్కుంటూ కేకలు వేయడం గుండె మెత్తగా కరగనప్పుడే. నీ పని చేయించుకోడానికి ప్రయత్నిస్తావు. కాని బల్లముందు కుర్చీలో కూర్చుని పొగాకును నములుతూన్న మహానుభావుడు నీకు కావలసిన పని చేసిపెట్టినా, పెట్టకపోయినా అతడి జీతం అతడికి ముడుతుంది. అందుచేత ఊరికే కష్టపడిపోవడం ఎందుకు?

ఒక వ్యక్తి స్వార్థం కోసం ఎంత తంటాలుపడతాడో ఎదుటివాని కష్టం తనకు వచ్చిన కష్టం వంటిదే అని తెలుసుకోని వాని మనస్సు ఎంత కాఠిన్యమో తెలుస్తుంది. ప్రపంచంలో తీవ్ర వాదులు ఎలా విజృంభిస్తున్నారో చూస్తుంటే శాంతిని అపేక్షించే మన దేశం గడగడలాడి పోతూ ఉంది. మరతుపాకి పేల్చి అమాయకులైన ప్రజలను ఎలా హతమార్చేస్తున్నారో!

హృదయ కవాటాలను తెరచుకోవాలి. అదే ఇప్పుడు ముఖ్యం. మనోభావాలను రక్షించుకోడానికి ఇతరుల భావాలను సానుభూతితో సేవార్ద్ర హృదయంతో పరిరక్షించాలి. ఎదుటివారికి మంచిని కల్గించు. మన ప్రవర్తన మన మనోభావం మీదే ఆధారపడి ఉంటుంది. సౌజన్యాత్మక స్వభావం లేనప్పుడు పరస్పరాపేక్ష, సమాజ జీవనం అంతా శూన్యమే. నిర్జన ప్రదేశంలో ఏకాంతంగా ఎడారిలోనో, అడవిలోనో విశ్రాంతగా ఉండవచ్చు.

పరస్పర సహకారంతో, పరస్పరానురాగంతో, పరస్పర ప్రేమ ఆదర్శాల ప్రవృద్ధితో జీవించడం నేర్చుకుందాము.

— 'లైట్ హౌస్' సౌజన్యంతో

## నవ్వు పావనశక్తి



ఒక్క ప్రత్యేక వ్యక్తికే గాక దేశానికి కూడా పునీతం చేసే అమోఘమైన శక్తి నవ్వుకు ఉంది. హాస్యభావం ఉంటే కాంతి యుతమైన ప్రాపంచిక దృక్పథం ఏర్పడుతుంది.

—లిన్ యుటాంగ్

"నమ్మకం వేరు, సత్యం వేరు. సత్యాలన్నీ నమ్మకాలు కావచ్చుగానీ, నమ్మకాలన్నీ సత్యాలు కావు."

# తెలిసిన చెట్లు - తెలియని విషయాలు

# చింత

జి. రాజేశ్వరరావు

చింత ఆఫ్రికా దేశానికి చెందిన వృక్షం. ఇది ఇప్పుడు ఉష్ణప్రదేశాలలో అనేక చోట్ల ప్రవృద్ధి పొందుతూంది. వృక్షశాస్త్రంలో దీన్ని టామరిండస్ ఇండికా (Tamarindus Indica) అంటారు. తెలుగులో చింత, కన్నడంలో హుళి, తమిళంలో పుళి, హిందీలో




ఇమ్లి, మరాటీలో చించి, సంస్కృతంలో తింత్రిణీ అని వివిధ పేర్లతో ఇది పిలువబడుతుంది.

పండిన చింతకాయలలో చింతపండు గుజ్జుతో అనేక విధాలైన చల్లని పానీయాలను తయారుచేస్తారు. నూరు గ్రాముల గింజలు, ఉట్టెలులేని శుభ్రమైన చింతపండు 283 కాలొరీల శక్తిని ఇస్తుంది. చింతపండు తియ్యగా పుల్లగా ఉంటుంది. చింతపండు కొద్దిగా క్షారగుణం (Alkaline) కలిగి ఉంటుంది. కాబట్టి పుల్లత్రేనుపులకు, కడుపు ఉబ్బరంతో కూడిన జ్వరం, వికారం, విదాహము మొదలైన రోగాలకు ఔషధంగా వాడుతారు. అరుచెంచాల చింతపండురసం ఉదయమే సేవిస్తే ఆకలి కలిగిస్తుంది. వాపులకు, నొప్పులకు చింతపండు రసం, ఉప్పు కలిపి మర్దనచేస్తారు. బెణుకులకు. వాపులకు చిక్కటి చింతపండు రసం ఉడికించి పట్టు వేస్తే వాపుతీసి బెణుకు నొప్పి తగ్గుతుంది. నోటిలో చిగుళ్ళు వాచి నెత్తురుకారుతూంటే చింతపండు నోటిలో పెట్టుకుంటారు. ప్రతీ సారీ భోజనం అయిన తరువాత బాగా పండిన చింతపండు కొద్దిగా తింటే మంచి జీర్ణకారిగా ఉపయోగపడుతుంది.

అజీర్ణ రోగాలకు, ఆకలి మందానికి చింతపండు చికిత్స ఉపకరిస్తుంది. నాలు గైదు చుక్కలు చింతపండు రసం ఒక గ్లాసు కాచి చల్లార్చిన పాలలో కలిపితే పాలు విరిగి పీళ్ళు పైన తేరతాయి. పాలు విరగ గొట్టగా వచ్చిన తేటనీరు రోజుకు మూడు పూటలు పుచ్చుకోవాలి. ఈ పాల తేటనీటిలో పాలలో లభించే ప్రోటీనులు అన్నీ లభిస్తాయి; సులభంగా జీర్ణమవుతాయి. దీన్ని తీసుకునే టప్పుడు తేలికగా అన్నం తింటూండాలి.

భారతదేశంలో దక్షిణాత్యులు ప్రతిరోజు చింతపండుతో తయారుచేసుకున్న చారు, సాంబారు (పప్పుపులుసు) తింటారు కాబట్టి

"కార్యరూపంలో చూపిన ప్రేమనే సేవ అంటారు."

వారికి గుండెపోటు జబ్బులు, మూత్రకోశపు సమస్యలు, మూత్రకోశంలో రాళ్ళుపెరగడం మొదలైన రోగాలు చాలా అరుదు అని కొందరు శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

చింతగింజల పొడికి అపూర్వ ఔషధ గుణాలు ఉన్నాయి. ఒక పెద్ద చెంచాడు చింతగింజల పొడి శుభ్రమైన నీటితో


TAMARIND

రోజుకు మూడు పర్యాయాలు పుచ్చుకుంటే అమశంక, జిగట విరేచనాలు నివారింపబడతాయి. అర్ధ పెద్ద చెంచాడు చింతగింజల పొడి రోజుకు రెండుసార్లు తేనె అనుపానంతో సేవిస్తే రక్తస్రావాన్ని తగ్గిస్తుంది. ఒక పెద్ద చెంచాడు చింతగింజల పొడి రుచికి కావలసినంత పంచదార కలిపి రాత్రిపూట భోజనానికి ముందు రెండు వారాలపాటు తీసుకుంటే వీర్యస్థలనాన్ని నివారిస్తుంది.

చింత చిగురుతో అనేక రకాల రుచికరమైన వంటకాలు తయారు చేసుకుంటారు. దీనియందు విటమిను ఎ సిలు, ఇనుము పుష్కలంగా లభిస్తాయి.

చింతకర్ర కాల్చగా వచ్చిన చింతబొగ్గు పొడి, తగినంత ఉప్పుపటిక, పిప్పరమెంటు పూవు చేర్చి పండ్లపొడి తయారుచేస్తారు. నువ్వుల నూనెలో చింతబొగ్గుల పొడిచేర్చిన ముద్ద కాలిన పుళ్ళను శీఘ్రంగా మాన్పుతుంది.

పులిత్రేనుపులకు, అజీర్తి వల్ల కలిగే వాంతులకు, ఇతర మత్తులకు, అజీర్ణానికి చింతపండు దివ్యౌషధము.

విషపదార్థాలు జఠరకోశంలో చేరినప్పుడు చింతపండు రసాన్ని అనేకసార్లు తాగించి కృత్రిమ వమనం చేయిస్తారు.

అన్నకోశము వాచినప్పుడు చింతపండు రసంలో లవంగాలు, దాల్చిన చెక్క (లవంగపట్ట) నూరి ఆ ముద్దను కలిపి త్రాగిస్తారు. 10 మిల్లీలీటర్ల శుభ్రమైన నీటిలో 6 గ్రాముల చింతపండు రెండుగంటలసేపు నానబెట్టి ఆ నీటిని నాలుగేసి గంటలకొకసారి పుచ్చుకుంటే వాంతులు తగ్గిపోతాయి. ఎప్పటికప్పుడు తాజాగా ఈ మందును చేసుకుంటూండాలి.

25 గ్రాముల చింతపండు 120 మిల్లీలీటర్ల నీటిలో ఒకగంటసేపు నానబెట్టి 6 గ్రాముల పంచదార చేర్చి ఇస్తే తలతిరగడం తగ్గుతుంది.

## అవకాశాలను మార్చుకోడానికి ధైర్యం

ఓ దేవా! మార్చుకోలేని అవకాశాలకు తగినట్లుగా మారడానికి ధైర్యాన్ని కలిగించు. మార్చుకోగలిగిన, మార్చవలసిన అవకాశాలను మార్చుకొనుటకు ధైర్యాన్ని కలిగించు. రెంటికీ తేడాను తెలుసుకోడానికి వివేకాన్ని కలిగించు.

"దైవదూరుడై లోకమున మనుటకంటె దరిద్రుడై బ్రతుకుట శ్రేయోదాయకము."

# ౩౦,౦౦౦ జాతుల సాలెపురుగులు

అవంతీ మెహ్‌తా

సాలె పురుగులకు 8 కాళ్ళుంటాయి. ఇతర కీటకాలకు ఆరే కాళ్ళు. కొన్ని జాతుల సాలెపురుగులకు 8 కళ్ళుంటాయి. కీటకాల శరీరం మూడు భాగాలుగా విభజింపబడి ఉంటుంది. సాలె పురుగుల శరీరం రెండు భాగాలుగా విభజింపబడి ఉంటుంది.


SPIDER

ప్రస్తుతం 30,000 జాతుల సాలెపురుగులు గుర్తించబడ్డాయి. భూమిమీద ఇవి నివసించని ప్రదేశమే లేదు. వాటికి కావలసిన చిన్న చిన్న పురుగులు, కీటకాలు వంటి ఆహారం సులభంగా లభ్యమయ్యేచోట ఇవి గూళ్ళు అల్లుకుంటాయి. కొన్ని సాలెపురుగులు చెరువులలో, నీటి గుంటలలో, నీటి పై తలంమీద కూర్చుని ఉంటాయి.

చాలామటుకు సాలీళ్ళు ఆహారం పట్టుకో డానికి పట్టుదారంతో గూడు అల్లుకుంటాయి. సాలీళ్ళ జఠరకోశంలో పట్టునూలు తయారీకి కావలసిన ప్రోటీనులను జనింపచేసే గ్రంథులు ఉన్నాయి. ఈ పట్టుదారం చాలా అద్భుతంగా, ఆశ్చర్యకరంగా ఉంటుంది. కొన్ని ఇనుపతీగలకంటే కూడా చాలా బలిష్ఠంగా ఉంటాయి. అవి తెగిపోయే ముందు ఎంతో పొడవుగా సాగుతాయి.

సాధారణంగా గూడు అల్లే సాలీడు ఆర్బ్‌వెబ్ స్పైడర్. బహుభుజ రూపంలో అల్లిన గూడు దీని ఆహారానికి అద్భుతమైన వలలా పనిచేస్తుంది. ఎగురుతూన్న కీటకాలు అకస్మాత్తుగా ఇందులో చిక్కుకుంటాయి. వలలో చిక్కుకున్న కీటకం గిజగిజ కొట్టు కుంటుంది. ఈ విషయం వెంటనే సాలీడుకి తెలిసిపోతుంది.

ఆర్బ్‌వెబ్ స్పైడర్ యొక్క గూటిని అంతను పట్టి ఉంచే మొదటి దారం అనేక మలుపులతో కొన్ని మీటర్ల పొడవు ఉంటుంది.

కొన్ని సాలీళ్ళు గుంపులు గుంపులుగా జీవిస్తాయి. ఒకే ఒక పెద్ద గూడులో అనేకం ఉంటాయి. భారతదేశంలో స్టెగోడైఫస్ (Stegodyphus) అనే సాలీళ్ళు పెద్ద గూడును నిర్మిస్తాయి. కొన్ని కిలోమీటర్ల పచ్చునిపైరును, చెట్లను కప్పేటంత వైశాల్యం కలిగి ఉంటాయి. ఉలోబోరస్ ఫెరోకస్ (Uloborus feroku) అనే మరో రకం సాలీళ్ళు ఈ గూళ్ళలో వాటితో పాటు విభజించుకుని జీవిస్తాయి. స్టెగోడైఫస్ గూటిలో చిక్కుబడిన కీటకాలమీద ఇవి జీవిస్తాయి.

"సమాజంలో మూఢవిశ్వాసాలనే రోగానికి
హేతువాదం ఒక గోసాయి చిటికలాంటిది."

ముఖ్యంగా అన్నిరకాల సాలెపురుగుల లోను మగవి ఆడవాటికంటే చాలా చిన్నవిగా ఉంటాయి. మగవి ఆడవాటిని ఆశించి ఉపసర్పించి గూటిలో చేరినప్పుడు వాటిని ఏవో ఇతర కీటకాలనుకుని ఆడవి పట్టుకుని తినేసే ఉపద్రవం ఉంటుంది. ఈ బాధనుండి తప్పించుకుని రక్షించుకోడానికి మగది ప్రత్యేక పరిసరానుగుణ్యతను ప్రదర్శిస్తాయి. ఆడసాలీళ్ళ గూళ్ళను మగవి ప్రత్యేక శబ్దంతో కంపింపజేస్తాయి. ఇతర సాలెపురుగులు పట్టిన ఆహారాన్ని తెచ్చి ఆడదానినోట్లో పెడుతూంటాయి. పీతలవంటి మరో రకం-క్రాబ్ స్పైడర్ జాతిలో మగది ఆడదానిచుట్టూ దారం చుట్టేసి బందించేస్తాయి.

ఆహారాన్ని పట్టుకోడానికి అన్నిరకాల సాలీళ్ళు గూళ్ళు అల్లవు. క్రాబ్ స్పైడర్ మెల్లిగా నడుస్తూ ఆకారంలో అలవాటుల లోను ప్రక్కలకు నడుస్తూ పీతలలాగా ఉంటాయి. ఇవి ఏదైనా పువ్వుమీద ఉన్నప్పుడు ఆ పువ్వు రంగును ప్రదర్శిస్తాయి. ఈ రహస్యం తెలియని కీటకాలు, తేనెటీగలు, సీతాకోకచిలుకలు వాటికి సులభంగా చిక్కిపోతాయి. దొరికిన కీటకాన్ని ముందు కాళ్ళలో గుచ్చి పట్టేసుకుంటాయి. కోరలు విషాన్ని కీటక శరీరంలో ఇన్‌జెక్ట్ చేస్తాయి. కీటకం స్తంభింపబడిపోతుంది. వెంటనే శరీరంలో ఉన్న జీవరసాలను మాత్రం పీల్చేసి అస్థిపంజరాన్ని ఉన్నదాన్ని ఉన్నట్టుగా వదిలేస్తుంది.

ఉల్ఫ్ స్పైడర్స్ ఆహారం వెతుక్కుంటూ సంచరిస్తాయి. తీక్షణమైన కంటిదృష్టితో ఆహారాన్ని ఇట్టే కనిపెట్టేస్తాయి. మెల్లిగా చడీచప్పుడు లేకుండా దగ్గరగా చేరి పొంచుండి అమాంతం ఎరమీదికి ఉరికి విషపుకోరలతో స్తంభింపజేసి చంపేస్తాయి.

—'పిజిజి-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో—

## వరదలవల్ల నష్టం

భారతదేశంలో వరదలవల్ల సాలీనా రూ. 777 కోట్లు నష్టం ఏర్పడుతూంది. మూటికి రెండువంతులు నష్టం ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, బీహార్ మరియు పశ్చిమ బెంగాల్‌లో సంభవిస్తూంది.

—'డిసాస్టర్ మేనేజిమెంట్' సౌజన్యంతో

## సగటున సాలుకి పెట్ట 240 గ్రుడ్లు పెడుతుంది



కోళ్ళను శాస్త్రీయ పద్ధతులలో పెంచడం ద్వారా గ్రుడ్లు ఉత్పాదన చాలా అధికమైంది. ఇప్పుడు ఒక సగటు కోడిపెట్ట సాలుకి 240 గ్రుడ్లు పెడుతూంది. 1940 లో ఇది 100 మాత్రమే. అమెరికనులు సగటున సంవత్సరానికి సుమారు 320 గ్రుడ్లను, 16.65 కి.గ్రా. కోడిమాంసం తింటారు.

"శాశ్వత సత్యమనే పునాది నిర్మించుకునేవరకు క్షేమానికి దూరమే."

# అవీ-ఇవీ

## ప్రపంచంలో మిక్కిలి పొడవైన సాగరగర్భ సొరంగం

ప్రపంచంలో మిక్కిలి పొడవైన సాగర గర్భ సొరంగం సీకాన్ (Seikan) సొరంగం జపానులో హోక్కాడియో మరియు హోన్షూ ద్వీపాలను కలుపుతుంది. పూర్తిగా రైల్వేవారి ఉపయోగానికి 700



SEIKAN TUNNEL, JAPAN

బిలియను ఎన్నుల ఖర్చుతో ఈ బ్రిడ్జిని నిర్మించడానికి 24 సంవత్సరాలు పట్టింది. మొత్తం 53.85 కి మీ.ల పొడవైన బ్రిడ్జిలో 23.3 కి మీ.లు ట్సుగారు (Tsugaru) జలసంధిలో సాగరజలగర్భంలో ఉంటుంది.

* * *

## డాల్ఫిన్‌లు మిక్కిలి తెలివైనవి

డాల్ఫిన్‌లు మిక్కిలి చాతుర్యంగా ఉంటాయి. వీటికి కళ్ళు మూసి గట్టిగా కట్టి వేసినా వీటి అడుగున ఉండే మిక్కిలి చిన్న వస్తువులను కూడా తెలుసుకుంటాయి. యు ఎస్ఎ ఫ్లోరిడాలో ఒక డాల్ఫిన్ మనుషుల మాటలను అనుకరిస్తుంది.

* * *

## ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ మరియు పశ్చిమ బెర్లిన్‌లో 2,000 మ్యూజియములు

ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ మరియు పశ్చిమ బెర్లిన్‌లో ఉన్న 2,000 మ్యూజియంలకు ప్రతీ సంవత్సరం తెరవబడిన క్రొత్త క్రొత్త మ్యూజియములు చేర్చబడుతూంటాయి. దేశంలో నివసించే 57 మిలియను మందిలో ప్రతీ ఒక్కరు సంవత్సరంలో ఏదో ఒక మ్యూజియంను సందర్శిస్తూనే ఉంటారు.

* * *

## చోరుడు - పండితుడు

ఒక రోజున ఒక చోరుడు మాథ్యూ హెన్రీ అనే గొప్ప పండితుడు నివసించే ఇంట్లోకి ప్రవేశించి అతడి పర్సును దొంగిలించుకుపోయాడు. ఆ ముసలి ఆశావాది నిర్విచారంతో తన డైరీలో ఈ విధంగా వ్రాసాడు.

ధన్యవాదాలు తెలుపుకుందాము. ఎందుకంటే ఇదివరకెప్పుడూ ఎవ్వరూ నన్ను దోచుకోలేదు. ఇదే మొదటిసారి. రెండవది: ఆ దొంగ నా పర్సు మాత్రమే దోచుకుపోయాడు గానీ నా ప్రాణాలు తీయలేదు. మూడవది: నాకు ఉన్నదంతా ఎత్తుకుపోయినా, అది ఎంతో లేదు. నాలుగు: ఆ దొంగ నన్ను దోచుకున్నాడు గానీ, నేను ఎవరినీ దోచుకోలేదు.

"సంఘటన తరువాతే అవివేకి వివేకవంతుడవుతాడు."

## క్రొత్త సూపర్ కంప్యూటర్

అమెరికన్ వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు ఒక క్రొత్త సూపర్ కంప్యూటర్‌ను అభివృద్ధి చేశారు. ఇది సాధారణంగా ఉండే కంప్యూటర్ కన్న 1000 రెట్లు ఎక్కువ శీఘ్రంగా పనిచేస్తుంది. ఇటీవలదాకా సూపర్ కంప్యూటర్ సాధారణ కంప్యూటర్‌కన్న 256 రెట్లు శీఘ్రంగా పని చేయగలదని నమ్మారు.

* * *

## చైనాలో ఎలుకలు లేని నగరం

చైనాలో 1.6 మిలియను జనాభాతో ఉండే డాలియన్ నగరం ఎలుకలు లేని నగరంగా ప్రకటింపబడింది. వాటి జాడ తెలుసుకోడానికి నగరం అంతా టాల్కం పౌడర్ చల్లడంవల్ల సువాసన వెదజల్లుతూంటుంది. విషంతో భారీ ఎత్తున వీటిని చంపడానికి చేపట్టిన ఉద్యమం తరువాత ఫలితాలను తెలుసుకోడానికి నగరం అంతా టాల్కం పౌడరు చల్లారు.

* * *

## అమెరికా దేశపు మొట్టమొదటి జలగర్భ హొటలు:

ఫ్లోరిడా తీరానికి దగ్గరగా కీ లార్గో దగ్గర నీటిలో మొట్టమొదటి హోటలు నిర్మింపబడింది. ఇక్కడకు వచ్చినవారు టివి చూడవచ్చు. కంప్యూటర్ ఆటలు ఆడవచ్చు. నీటి అడుగున 9 మీటర్లలో ఒక రాత్రి గడపడానికి ఎవరైనా 300 డాలర్లు చెల్లించాలి. ఇక్కడికి వచ్చేవాళ్ళు మాత్రం అంతా అనుభవంగల డైవర్లు అయి ఉండాలి.

## 4,000 మందికి సరిపోయే "శాండ్‌విచ్"

ఇటలీలో వంటవాళ్ళు 40 గంటలసేపు శ్రమపడి టొమాటోలు చీస్, మాంసం అన్నీ కలిపి 300 గజాల శాండ్‌విచ్‌ను తయారుచేశారు. ఇది 4,000 మంది అరగించారు.

## భారతదేశంలో 372 వన్యమృగ రక్షణా కేంద్రాలు



ప్రస్తుతం భారతదేశంలో మొత్తం 0.6 శాతం భూప్రదేశం ఆక్రమించిన 21,003 చ.కిమీ. ల వైశాల్యంలో 54 నేషనల్ పార్కులు, దగ్గర దగ్గరగా 2.7 శాతం భూప్రదేశం ఆక్రమించిన 88,649 చ. కిమీ. ల వైశాల్యంగల 372 వన్యమృగ రక్షణ కేంద్రాలు, సుమారు 3.3 శాతం భూప్రదేశం ఆక్రమించిన 1,09,652 చ. కిమీ. ల వైశాల్యంలో 426 సంరక్షక ప్రదేశాలు (Protected areas) ఉన్నాయి.

"హిమాలయాల ఎత్తులకుగానీ, పాతాళపు లోతులకు గానీ మనిషిని చేరవేసేది మనసే."

# మొసళ్ళు

టి.ఎస్.ఎన్. మూర్తి

శరీరంపైన గట్టి రక్షక కవచం కలిగిన పెద్ద పెద్ద బల్లుల వంటివి మొసళ్ళు. వీటికి బ్రహ్మాండమైన శక్తి ఉంటుంది. దాంతో పాటు జంతువులను, మనుష్యులను అమాంతంగా చంపి తింటుంది. అందువల్లే మొసళ్ళకు అందరూ భయపడతారు. ఇవి సాధారణంగా నీటిలోనే ఉంటాయి. అయినా భూమి మీద కూడా సంచరించగలవు. వీటి శరీరంలో అంగ నిర్మాణం-ముఖ్యంగా పెద్ద ముట్టెపైన ముక్కు రంధ్రాలు, పారదర్శకమైన పొరతో కప్పబడిన మిడిగుడ్లు-ఇవి నీటిలో సులభంగా



సంచరించడానికి సహకరిస్తాయి. కొద్దిగా తలను నీటిపైకి పెట్టి నీటిలోనే ఉంటూ వాసన చూసి పసిగట్టగలవు, చూడగలవు, వినగలవు. ఆహారాన్ని సులభంగా పట్టుకోగలవు. నీటిలో దొరికే ఆహారాన్ని తినగలవు.

మొసళ్ళు అనేక రకాల ఆహారం తింటాయి. బ్రతికి ఉన్న ప్రాణులను, చచ్చిపోయిన వాటిని, కుళ్ళిపోయిన వాటినికూడా తింటాయి. చిన్న చిన్న కీటకాలు, నత్తలు, కప్పలు, పీతలు మొదలుకొని చేపలు, తాబేళ్ళు, పక్షులు, క్షీరదాలు మొదలైన వాటిని తింటాయి. ఆడ మొసళ్ళు దజన్ల కొద్దీ గ్రుడ్లను గట్లమీద, ఇసుక గోతులలో పెడతాయి. వీటిలోనుంచి చిన్న చిన్న మొసళ్ళు వచ్చేదాకా తల్లి, తండ్రి మొసళ్ళు జాగ్రత్తగా కనిపెట్టుకుని చూస్తాయి. భారతదేశంలో




## తివాసీ నేయడానికి 40 సంవత్సరాలు పట్టింది

ఇప్పుడు లండన్ విక్టోరియా అండ్ ఆల్బర్ట్ మ్యూజియంలో ఉన్న అందమైన చేనేత తివాసీ ఆర్డెబిల్ పవిత్ర నగరంలోని మసీదులో ఉపయోగించడానికి మాక్సౌద్ తయారుచేశాడు. ఇతడు తన 25వ సం.రం. ప్రాయంలో దీనిని నేయడం ప్రారంభించాడు. పని పూర్తికావడానికి 40 సంవత్సరాలు పట్టింది. ఇది 34 అడుగుల పొడవు ఉంటుంది. ఒక చదరపు అంగుళానికి 330 చేతితో వేసిన ముళ్ళు ఉంటాయి. దీనికి మొత్తం 33.038.200 ముడులు ఉన్నాయి.

"ప్రార్థిస్తూ ఆలోచిస్తే ప్రతిది దేవుని సహాయమే అనిపిస్తుంది;
పని చేస్తూ ఆలోచిస్తే ప్రతిదీ మానవునివల్లే జరుగుతుందనిపిస్తుంది."

సాధారణంగా మూడు రకాల మొసళ్ళు ఉన్నాయి. పొడవైన ముట్టెగల ఘారియాల్ (Gharial) చాలా అపురూపమైన, భయంకరమైన ఉప్పునీటి మొసలి. సామాన్యమైన మార్ష్ క్రోకోడైల్ ఘారియల్ మరియు ఉప్పునీటి మొసళ్లు 7 మీటర్ల పొడవు పెరుగుతాయి. బురదనీటి మొసలి 4 మీటర్లు పెరుగుతుంది.


BABY CROCODILES

ఘారియల్ అనే పేరు దీనికి కూజాలా ఉండే పొడుగుపాటి ముట్టెనుంచి వచ్చి ఉంటుంది. ఘారా అంటే హిందీలో కూజా. ఘారియాల్‌కి దవడలు సన్నగా, పొడుగ్గా ఉంటాయి. సాధారణంగా చేపలను పట్టుకుంటుంది. గంగా మహానది, బ్రహ్మపుత్ర నదులలో ఉంటాయి. ఇవి చాలా పిరికివి.

మార్ష్ క్రోకడైల్ లేక బురద మొసలి ముట్టె పొట్టిగా వెడల్పుగా బలిష్ఠంగా ఉంటుంది. ఇవి పెద్ద పెద్ద చెరువులలో నదులలో రిజర్వాయర్‌లలో నివసిస్తాయి. ఇది కూడా నిరపాయకరమైనదే. వీటిలో పెద్దవి ప్రమాదకరంగా ఉంటాయి.

ఉప్పునీటి మొసలి సాధారణంగా నదీ ముఖద్వారాలలోను, నేలమీద కూడా నివసిస్తాయి. ఇవి చాలా భయంకరమైనవి, అపాయకరమైనవి. మనుష్యులను తింటాయి అని అంటారు. ఇప్పుడు ఇవి పశ్చిమబెంగాల్ సుందర్ బాన్స్‌లో, ఒరిస్సాలోను, అండమాను, నికోబార్ ద్వీపాలలోను నివసిస్తున్నాయి.

ఇవి నదులలోను, చెరువులలోను చచ్చిపోయిన చేపలను, జంతువులను తిని నీటిని శుభ్రంగా ఉంచుతాయి. పరిసర వాతావరణాన్ని ఆరోగ్యవంతంగా ఉంచుతాయి. మొసళ్ళు కలిగించే ఈ లాభాన్ని గ్రహించకుండా మంచి విలువగల దాని చర్మంకోసం మొసళ్ళను క్రూరంగా చంపేస్తున్నారు. ఎక్కడ కనిపిస్తే అక్కడ వాటిని మానవులు వేటాడి చంపేస్తున్నారు. భారతదేశంలో ఇప్పుడు ఘారియల్ మరియు ఉప్పునీటి మొసలి అంతరించిపోతూన్న ప్రాకుడు జంతువులు.

## ప్రపంచంలో అతి పెద్ద ఇన్‌ఫ్రారెడ్ దూరదర్శిని

ప్రపంచంలో మిక్కిలి పెద్ద ఇన్‌ఫ్రారెడ్ దూరదర్శిని యునైటెడ్ కింగ్‌డమ్‌లో రూపొందించబడింది. ఇది ప్రత్యేకంగా ఇన్‌ఫ్రారెడ్ పరిశోధనలకు ఉపయోగపడుతుంది. దీనిని 1979 లో హవాయిలో మిక్కిలి ఎత్తైన పర్వతశిఖరంమీద ఏర్పాటుచేసారు. ఇక్కడే ఉండే జేమ్స్‌క్లార్క్ మాక్స్‌వెల్ దూరదర్శిని మిల్లీమీటరు అంతకంటే తక్కువ తరంగదైర్ఘ్యాలను కొలవడానికి ఉపయోగపడుతుంది. ఇది ప్రపంచంలో మిక్కిలి పెద్దది. దీనిని బ్రిటన్ ఎడింబర్గ్ రాయల్ అబ్జర్వేటరీ వారు నడుపుతారు.

"అస్థిరమైన అల్పవస్తువులమీది వ్యామోహంవల్ల తరచు సుస్థిరమైన గొప్పవస్తువు జారిపోతుంది."

# ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ
## 2

196 యూనివర్సిటీలు ఇతర ఉన్నత విద్యాసంస్థలతోపాటు 26 ఆర్ట్ మరియు మ్యూజిక్ అకాడమీలు ఉన్నాయి. యూరోపియన్ కమ్యూనిటీలోని తొమ్మిది దేశాలలో ఫెడరల్ రిపబ్లిక్ ఒకటి. విదేశీ వ్యాపారం (ఎగుమతులు, దిగుమతులు)లో యుఎస్ఏ తరువాత ఇది రెండవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. మొత్తం దేశీయ ఉత్పాదనలో


BERLIN (WEST) AIRPORT

నాల్గవవంతు ఎగుమతి చేయబడుతుంది. మెషినరీ, ఆటోమొబయిల్స్, రసాయనిక పదార్థాలు మరియు ఎలక్ట్రికల్ వస్తువులు మొదలైన ప్రగతిపూర్వక సాంకేతిక వస్తువులు ఎగుమతి చేయబడతాయి.

ఈ ఫెడరల్ రిపబ్లిక్‌లో 6,950 కి.మీ.ల ఆటోబాన్స్ (autobahns) తో మొత్తం 4,50,000 కి.మీ. రహదారి మార్గాలు ఉన్నాయి జర్మన్ లుఫ్తాన్సా మరియు 60 ఇతర అంతర్జాతీయ వైమానిక సంస్థలు ఈ దేశంలో 10 విమానయాన కేంద్రాలకు వైమానిక సౌకర్యాలను కలిగిస్తున్నాయి.

1.200 ప్రచురణలతో మొత్తం 23 మిలియను కాపీలు దినపత్రికలు ప్రచురింపబడతాయి. వివిధ రకాల వార, పక్ష, మాస

## నమ్మలేని నిజాలు

### ఒక సంవత్సరంలో 13 తరాలు

కొన్ని రకాల నల్లులలో ఒకే సంవత్సరంలో 13 తరాలు ఏర్పడతాయి.

* * *

### ఆహారదేవతకు దేవాలయం

నేపాల్ హిమాలయ సామ్రాజ్యంలో ఆహారదేవతకు ఒక దేవాలయం ఉంది. రకరకాల గిన్నెలు, పళ్ళాలతో నైవేద్యాలు చేస్తారు.

* * *

### ఒక అగ్గిపుల్లమీద 32 పంక్తుల మాటలు

తూర్పు యూరప్ హంగేరీలో ఒక వ్యక్తి ఒక అగ్గిపుల్లమీద 32 పంక్తులతో మాటలు ఇరికించగలిగాడు.

* * *

### 68 సంవత్సరాల తరువాత అందిన పోస్టు కార్డు

యునైటెడ్ స్టేట్స్ మిచిగాన్‌లో ఫిబ్రవరి 1976 న ఒక వ్యక్తి ఒక పోస్టుకార్డును అందుకున్నాడు. ఇది అతడి తాతకి 68 సంవత్సరాల పూర్వం వ్రాయబడింది.

"లోలత లేని స్థిరబుద్ధికే భ్రమ ప్రమాదాలు లేని నిశ్చయమైన వాస్తవిక దృష్టి కలుగుతుంది."

పత్రికలు 11,000 పైగా ఉన్నాయి. మొత్తం 190 మిలియను కాపీలు ప్రచురింపబడు న్నాయి. రేడియో మరియు టెలివిజన్ స్టేష నులు ప్రభుత్వంతో సంబంధం లేకుండా పబ్లిక్ బాడీలు నిర్వహిస్తాయి.

ఫెడరల్ రిపబ్లిక్‌లో 200 థియేటర్లు, నాటకశాలలు, 100 పెద్ద ఆర్కెస్ట్రాలు, సుమారు 800 మ్యూజియంలు ఉన్నాయి. ప్రతీ సంవత్సరం 50,000 క్రొత్త గ్రంథాలు ప్రచురింపబడతాయి. ఇతర భాష లలోకంటే అత్యధికంగా జర్మన్ భాషలోకి అనేక గ్రంథాలు అనువదింపబడతాయి.



BONN (CAPITAL)
FEDERAL REPUBLIC OF GERMANY

ఇతర వివిధ భాషలలోకి అనువదించబడిన జర్మన్ గ్రంథాల రచయితలు అంతర్జాతీయ ప్రఖ్యాతిని పొంది ఉంటారు.

నగరాలలో మ్యుంచెన్ (Munchen) లో మిక్కిలి ఎక్కువగా 100కి పైన జర్మన్ యూనివర్శిటీలు ఉన్నాయి. మ్యుంచెన్ కళా వస్తుసేకరణతో థియేటర్లతో, సైన్స్ అండ్ టెక్నాలజీకి చెందిన పెద్ద మ్యూజియంగా ప్రపంచంలో ప్రసిద్ధి చెందింది.

గొప్ప గొప్ప రచయితలు, తత్త్వశాస్త్ర జ్ఞులు, సంస్కర్తలకు స్టుట్‌గార్ట్ నివాస స్థలం. జర్మనీదేశపు పురాతన యూనివర్శిటీ హిడిల్‌బర్గ్‌లో ఉంది. జర్మనీలో మిక్కిలి ప్రసిద్ధి పొందిన గోథిక్ కెథీడ్రల్ స్పైర్ ఉల్మ్ (Ulm) లో ఉంది. అంతర్జాతీయ వైమానిక కేంద్రంగా ప్రసిద్ధి పొందిన ఫ్రాంక్‌ఫర్ట్ వివిధ బాంకులకు, ఇన్సూరెన్స్ కంపెనీలకు పుట్టినిల్లు. ప్రతీ సంవత్సరం నిర్వహింపబడే అంతర్జాతీయ బుక్‌ఫెయిర్



RADIOTELESCOPE. EFFELSBERG

ఇక్కడే నిర్వహింపబడుతుంది. ఈఫెల్ (Eifel) లో రేడియో తరంగాల పరిశోధ

## చట్టము న్యాయము వివిధ మార్గాలలో నడుస్తున్నాయి

చట్టమును అనుసరించి న్యాయము, న్యాయాన్ని అనుసరించి చట్టము ఒకే మార్గంలో ఉండాలి. కానీ స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో ఈ రెండు రెండు విధి మార్గాలలో పోతున్నాయి. వ్యక్తి వ్యాపారాల ప్రమేయం లేకుండా మన విలువలను పునఃపరిశీలన చేసుకోవాలి. అప్పుడే మన ధర్మం నవచైతన్యంతో ప్రవృద్ధి పొందుతుంది.

—స్వామి రంగనాథానంద

"సర్వత్రా సమభావాన్ని వహించడమే అనుభవసిద్ధమైన వివేకం."

నకు ఏర్పాటైన 100 మీటర్ల రేడియో టెలిస్కోపు ప్రపంచంలో మిక్కిలి పెద్దది.

1949 నుంచి బాన్ ఫెడరల్ రిపబ్లిక్ రాజధాని. ఇది ప్రభుత్వ సంస్థలకు, పార్లమెంటుకు, ప్రభుత్వ నిర్వహణకు ముఖ్య కేంద్రము. చాలామటుకు పెద్ద పెద్ద ఉత్పాదక మరియు వ్యాపార సంస్థల నిర్వహణ కేంద్రాలు డస్సెల్‌డార్ఫ్‌లో ఉన్నాయి.


PORT OF HAMBURG

హానోవర్ ఇండస్ట్రియల్ ఫెయిర్ ప్రపంచంలో మిక్కిలి పెద్దది. ఇచ్చట అంతర్జాతీయ పారిశ్రామిక వస్తువులు ముఖ్యంగా జర్మన్ పారిశ్రామిక వస్తువులు ప్రదర్శింపబడతాయి. హాంబర్గ్ యూరప్‌లో మిక్కిలి పెద్ద రెండవ నౌకాశ్రయము. ఇది ఉత్తర జర్మనీయొక్క ప్రపంచద్వారము - 'గేట్ వే టు ది వరల్డ్'

1945 వరకు బెర్లిన్ జర్మన్ రీచ్ రాజధానిగా ఉండేది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత బెర్లిన్ తూర్పుపడమరలుగా రెండు భాగాలుగా విభజింపబడింది. 2 మిలియను మంది జనాభాతో పశ్చిమ బెర్లిన్ ఇప్పుడు అమెరికా, బ్రిటిష్ మరియు ఫ్రెంచి సైనికుల రక్షణలో ఉంది. ఇది ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీకి విలీనదేశము. పశ్చిమ బెర్లిన్ ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ ఆర్థిక విధానాన్ని, న్యాయవిచారణ విధానాన్ని సమైక్యం చేసుకుంది. ఇప్పుడు పశ్చిమ బెర్లిన్ ఈ రిపబ్లిక్‌కు చెందిన గొప్ప ఉత్పాదక కేంద్రం. ●

## ఇది దురదృష్టం అని ఎలా అనుకుంటావు?

ఒక పాడుబడిన కోటలో ఒక కొండ సైన వృద్ధుడు తన కొడుకుతో నివసిస్తున్నాడు. ఒకనాడు అతడి గుర్రం తప్పించుకు పోయింది. ఇరుగు పొరుగువాళ్ళంతా వచ్చి దురదృష్టానికి అతనిని ఓదారిస్తున్నారు. అప్పుడు వృద్ధుడు 'ఇది దురదృష్టమని మీకెలా తెలుసు?' అని అడిగాడు. కొన్నిరోజులకు అతడి గుర్రం మరికొన్ని అడవి గుర్రాలతో చేరి వచ్చింది. ఇరుగుపొరుగువాళ్ళంతా ఆశ్చర్యంతో అదృష్టానికి పొంగిపోయి వృద్ధుణ్ణి సంతోషంతో అభినందించడానికి ప్రారంభించారు. దీనికి ఆ వృద్ధుడు 'ఇది అదృష్టమని మీకెలా తెలుసు?' అన్నాడు. పట్టా గుర్రాలతో అతడి కొడుకు ఒకరోజున ఒక గుర్రం ఎక్కి ష్వారీకి బయలుదేరాడు. జారిపడి అతడి కాలు విరిగింది. తిరిగి ఇరుగుపొరుగువారు వచ్చి విచారంతో సంతాపాన్ని తెలియజేశారు. తిరిగి వృద్ధుడు 'ఇది దురదృష్టమని మీకెలా తెలుసు' అని అడిగాడు. మరుసటి సంవత్సరం గొప్ప యుద్ధం ప్రారంభమైంది. వృద్ధుడి కొడుకు కుంటివాడు కాబట్టి యుద్ధంలో చేరవలసిన అవసరం లేకపోయింది. —శాలి కాప్

"ఉన్న తాశయమే జీవిత ముఖ్యలక్షణం."

# నిజాలు - నిదర్శనాలు

## ప్రతీ సంవత్సరం 43 మిలియను టన్నుల కాయగూరలు పండించబడుతున్నాయి:

ప్రతీ సంవత్సరం భారతదేశంలో సుమారు 23 మిలియను టన్నుల పళ్ళు,



మరియు 43 మిలియను టన్నుల కాయగూరలు పండింపబడుతున్నాయి. సుమారు 35 శాతం ఉత్పాదింపబడిన పళ్ళు, కాయగూరలు వినియోగమవటంలేదు, వ్యర్థమైపోతున్నాయి.

* * *

## భారతదేశంలో 9.5 మిలియను మంది అంధులు:

ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చి వారి పరిశోధనల ప్రకారం భారతదేశంలో 9.5 మిలియను మంది అంధులు ఉన్నారు. వీరిలో 55 శాతం కాటరాక్టు మరియు గ్లూకోమావల్ల, 20 శాతం కార్నియల్ రోగంవల్ల అంధులవుతూంటే మిగతా వారు పోషకాహార లోపంవల్ల మరియు ఇతర కారణాలవల్ల గ్రుడ్డివారవుతున్నారు.

* * *

## 1987-88 లో దూరదర్శన్ రూ. 136.29 కోట్లు సంపాదించింది:

1987-88 సం.లో దూరదర్శన్ మొత్తం ఆదాయం రూ. 136.29 కోట్లు. సీరియల్ రామాయణం మొత్తం 78 ఉపాఖ్యానాల ప్రదర్శనతోపాటు టెలికాస్ట్ చేసిన అడ్వర్టైజ్‌మెంటువల్ల వచ్చిన మొత్తం ఆదాయం రూ. 24.40 కోట్లు.

* * *

## 1987-88 లో ఉత్పాదింపబడిన చేనేత బట్ట:

1987-88 లో భారతదేశంలో ఉత్పాదింపబడిన చేనేతబట్ట విలువ రూ. 3,948

### పాఠకుల అభిప్రాయాలు

"మనలో సమర స్వభావం తరిగితే
సమరస భావం పెరుగుతుంది."
—పి.వి. శేషబాబు, శ్రీరాంనగర్.

* * *

"జాలిలేని హృదయం విలువలేదు
నీతిలేని నడవడికి గౌరవంలేదు."
—కొండూరు చంద్రశేఖర్,
అంకిరెడ్డిపాలెం.

"జీవితంలో భయపడవలసినది లేదు, జీవితాన్ని అర్థం చేసుకోవాలి."

క్లోట్లు. రూ. 516.21 కోట్ల విలువగల చేనేత బట్ట 1987_88 లో ఎగుమతి చేయబడింది.

* * *

## భారత రైల్వేలు మొత్తం 318 మిలియను టన్నుల సరకు రవాణా చేసాయి:



1987_88 లో భారతరైల్వేలు 318 మిలియను టన్నుల సరకుల రవాణా చేపట్టాయి. 1986-87 లో రవాణా చేసినదాని కంటే ఇది 11 మిలియను టన్నులు అధికం.

* * *

## ప్రతీ సంవత్సరం నాలుగు మిలియను మంది పిల్లలు నీటివల్ల ప్రబలే అంటు రోగాలవల్ల మరణిస్తున్నారు:

భారతదేశంలో ప్రతీ సంవత్సరం సుమారు నాలుగు మిలియనుమంది పిల్లలు నీటివల్ల ప్రబలే అంటురోగాలవల్ల మరణిస్తున్నారు. ప్రతీ సంవత్సరం సుమారు 8000 కలరా రోగులు, ఒక మిలియను గాస్ట్రో ఎంటిరైటిస్ రోగులు, ఏడు మిలియను డిసెంట్రీ కేసులు నమోదుకాబడుతున్నాయి.

* * *

## 100 మిలియను మంది బీడీలు కాల్చేవారు:

ఇటీవలి లెక్కల ప్రకారం మొత్తం 125 మిలియను పొగ కాల్చేవాళ్ళలో 25 మిలియను మంది సిగరెట్లు కాలుస్తారు. మిగతావారంతా బీడీలు కాలుస్తారు.

* * *

## ప్రపంచంలో 15 మిలియను కుష్ఠురోగులు:

మొత్తం ప్రపంచంలో 15 మిలియను కుష్ఠురోగులు ఉన్నారు. దీంట్లో భారత దేశంలో 3.95 మిలియను మంది ఉన్నారు. 1956 నుంచి భారతదేశంలో సుమారు 2.6 మిలియనుమంది కుష్ఠురోగులకు నివారణ కలిగించబడింది.

## అవార్డు

### 1988 క్యోటో బహుమానం

3,60 000 డాలర్ల విలువచేసే 1988 క్యోటో బహుమానం 88 సంవత్సరాల వృద్ధుడు ప్రొ. పాల్ థైయెమి అనే జర్మన్ ఇండాలజిస్టుకి ఇవ్వబడింది. వేదాలు మరియు భారతీయ వాఙ్మయం అనే గ్రంథానికి నోబెల్ బహుమానానికి సమానమైన ఈ జపాను బహుమానము అతడికి ఇవ్వబడింది.

## 73.38 లక్షల ఎకరాలు అదనపు భూమిగా ప్రకటింపబడింది:

భారతదేశంలో 73.38 లక్ష ఎకరాల ప్రదేశం అదనపు భూమిగా ప్రకటింపబడింది. దీంట్లో 44.32 లక్ష ఎకరాలు 41.01 లక్ష మంది భూవసతి లేనివారికి రాష్ట్ర ప్రభుత్వాలు పంచిపెట్టాయి.

* * *

## భారతదేశంలో విద్యుత్ ఉత్పాదక శక్తి:

ప్రస్తుతం భారతదేశంలో స్థాపితమైన విద్యుత్ ఉత్పాదక శక్తి 50 256 MW. 32,776 MW థెర్మల్, 16,212 MW జల మరియు 1,270 MW అణు విద్యుత్తు.

* * *

## పబ్లిక్ సెక్టార్‌లో మొత్తం 71 శాతం ఉద్యోగస్తులు ఉన్నారు:

మొత్తం ప్రజాసంస్థలలో 25.51 మిలియను మంది ఉద్యోగస్థులలో 71.1 శాతం పబ్లిక్ సెక్టారులో ఉన్నారు. మొత్తం ప్రజా సంస్థలలో పనిచేసేవారిలో మహిళలు 13.4 శాతం. ఇతర రాష్ట్రాలలో కంటే మహారాష్ట్రలో ప్రజాసంస్థలలో ఎక్కువ మంది ఉద్యోగాలు చేస్తున్నారు. అధికంగా స్త్రీలు అస్సాంలో ముఖ్యంగా టీ తోటలలో పని చేస్తున్నారు.

## క్రికెట్ విశేషాలు



### 1974 లో మొట్టమొదటిసారి 7 వికెట్లు తీశాడు

న్యూజిలాండ్‌కు చెందిన రిచర్డ్ హేడ్లీ మొట్టమొదటిసారి 1974 మార్చిలో న్యూజిలాండ్ ఆస్ట్రేలియాను ఓడించినప్పుడు ఏడు వికెట్లను తీసాడు.

### 21 మెయిడెన్ ఓవర్లు

ఇండియాకు, ఇంగ్లండుకు జరిగిన టెస్టు మాచ్‌లో బౌలర్ ఆర్.జి. నాడ్‌కర్ని వరుసగా 21 మెయిడెన్ ఓవర్లు బౌల్ చేసాడు.

### 100 టెస్ట్ కాచ్‌లను తీసుకున్న మొదటి వ్యక్తి

వాలీ హమ్మండ్ (ఇంగ్లండు) 100 టెస్టు కాచ్‌లను చేసిన మొదటి వ్యక్తి.

"తన తప్పును తాను వెతుక్కున్నవాడే ధన్యుడు."

# పుష్కరము

పుష్కరం అనేటప్పటికి ముఖ్యంగా ఆంధ్ర ప్రదేశ్ లో నివసించేవారందరికి చాళుక్య వంశరాజులలో ప్రధానుడైన రాజరాజ నరేంద్రుని రాజధాని రాజమండ్రి, ఆయన ఆస్థానంలో ఆదికవి బిరుదము వహించిన వైదికమతోద్ధారకుడు నన్నయ, సారంగధరుని మెట్ట, ఎక్కడో నాసిక్ దగ్గిర త్ర్యంబకేశ్వరంలో పుట్టి సుమారు 900 మైళ్ళు



ప్రవహించి, రాజమండ్రి చేరిన గోదావరి, 19వ శతాబ్దం (1845-1890) చివరి భాగంలో అఖండ గోదావరిపై నిర్మించబడిన ధవళేశ్వరం ఆనకట్ట, కాటన్ దొర, అద్భుతమైన రైల్ కమ్ రోడ్డు బ్రిడ్జి. పేపరు మిల్లులు, గోదావరి వరదలు, వర్షకాలంలో బురదరోడ్లు జ్ఞాపకం రాకమానవు.

పుష్కరం పన్నెండు సంవత్సరాలకొకసారి జరిగే మహోత్సవం. నవగ్రహాలలో గురుడు (బృహస్పతి) సూర్యుని చుట్టూ ఒకసారి తిరగడానికి 12 సంవత్సరాలు పడుతుంది. ఒక్కొక్క భ్రమణం పూర్తి చేసుకున్న బృహస్పతి మేషం, వృషభం మొదలైన 12 రాశులలో ఒక్కొక్క రాశిలో ప్రవేశిస్తూంటాడు. ఒక్కొక్క రాశిలో గురుడు ప్రవేశించినప్పుడు 12 సంవత్సరాలకు ఒక్కొక్కసారి ఒక్కొక్క నదికి పుష్కరాలు (పుష్కర ఉత్సవాలు) జరుగుతాయి. గురుడు మేషంలో ప్రవేశించినప్పుడు గంగా నదికి, వృషభంలో ప్రవేశించినప్పుడు నర్మదా నదికి, మిధునంలో ప్రవేశించినప్పుడు సరస్వతీ నదికి, కర్కాటకంలో ప్రవేశించినప్పుడు యమునానదికి, సింహములో ప్రవేశించినప్పుడు గోదావరికి, కన్యలో ప్రవేశించినప్పుడు కృష్ణానదికి, తులలో ప్రవేశించినపుడు కావేరికి, వృశ్చికంలో ప్రవేశించినప్పుడు భీమనదికి, ధనుస్సులో ప్రవేశించినప్పుడు తామ్రపర్ణికి, మకరంలో ప్రవేశించినప్పుడు తుంగభద్రకి, కుంభరాశిలో ప్రవేశించినపుడు సింధు నదికి, మీనరాశిలో ప్రవేశించినపుడు తపతి నదికి పుష్కరాలు జరుగుతాయి.

ఈఉత్సవానికి పుష్కరం అనే పేరు పెట్టిన పుష్కరుడు మందాకిని కుమారుడు. ఈ పుష్కరుడికి బృహస్పతి (గురువు)కి గల సంబంధం తెలలేదు. ఈ పుష్కరుడు 33 కోట్ల దేవతలతో, ఋషులతో ఆయా నదులలో ఆ పుణ్యసమయంలో స్నానం చేస్తాడని, ఆ అపూర్వ అవకాశం వినియోగించుకుని మనం స్నానం చేస్తే మన పాపాలు

"తీవ్రపరితాపమొక్కటే భగవద్దర్శనమునకు నిశ్చితమైన మార్గము."

కొట్టుకుపోతాయని విశ్వాసం. నిజమే అని పిస్తుంది ఊరంతా కిక్కిరిసిపోయిన భక్తులు, యాత్రికులు, ఎక్కడ చూసినా పూజలు, పునస్కారాలు, సంకల్పాలు, స్నానాలు, నుర గలు కక్కుకుంటూ హోరుమని భయంకర మైన ధ్వనితో ప్రవహిస్తున్న గోదావరిని చూస్తూంటే ప్రపంచమే మరచిపోతాం.



పుష్కరం అనేమాట సంస్కృత పదం. పుష్కరం అంటే నీరు, కూడిక, సంయో గం మొదలైన అర్థాలు అనేకం ఉన్నాయి. పుష్టిని ఇచ్చేది, పుష్టికరమైనది అని కూడా అర్థం ఉంది. తెలియక గోవుని చంపిన పాపాన్ని గౌతముడు (గౌతమ మహాముని) పోగొట్టుకోడానికి గోదావరి మహానది త్రిమూ ర్తులలో ఒకడైన శివుని జటాజూటము నుండి ప్రవహించిందని, అందుకే ఈ నదికి గౌతమీ నది అని పేరు వచ్చిందని కథ.

ఈ నది గట్టున తపస్సు చేసుకునేవారికి, గంగానది గట్టున మరణించినవారికి, కురు క్షేత్రంలో గౌతమి తీరంలో దానం చేసిన వారికి మూడు రెట్లు అధికంగా పుణ్యం లభి స్తుందని అంటారు. సృష్టి ఆదిలో గురుడు మేషంలో చేరినప్పుడు గంగ హిమాలయాల నుంచి ప్రవహించిందని, గోదావరి పశ్చిమ కనుమలగుండా బృహస్పతి సింహంలో ప్రవేశించినప్పుడు ప్రవహించిందని హిందు వుల నమ్మకం.

రాజమండ్రి దగ్గర గోదావరినదిలో కోటి లింగాల రేవు చాలా ప్రాముఖ్యమైనది. ఆ రేవులో అనేక రాళ్ళు ఉన్నాయి. ఇవన్నీ శివలింగా లంటారు. కోటి లింగాల తరువాత ముఖ్యమైనది మార్కండేయ దేవాలయం. దీని దగ్గర మార్కండేయ ఘాట్ ఉంది. మార్కండేయ మహాముని ఇక్కడ ఘోర మైన తపస్సు చేశాడు. శివుని వరప్రసాదం వల్ల మార్కండేయ మహామునికి మార్కం డేయుడనే కుమారుడు పుట్టాడు. అనేక వేల సంవత్సరాలు జీవించి అనేక ప్రళయాలు చూసిన ఈ మార్కండేయుడు నది ఒడ్డున ఒక పెద్ద ఆలయంలో శివలింగాన్ని ప్రతిష్ఠా పించాడు అని ప్రతీతి.

ఉత్తర ఇండియా హరిద్వార్, అలహా బాద్, నాశిక్, ఉజ్జయినీలలో వరుసగా 12 సంవత్సరాల కొకసారి కుంభమేళ చాలా ముఖ్యమైనది. దక్షిణాదిని రాజమండ్రిలో గోదావరి పుష్కరం, బెజవాడలో కృష్ణా పుష్కరం, కుంభకోణంలో మహామాఘం చాలా బ్రహ్మాండంగా జరుగుతాయి. కుంభ కోణంలో మాత్రం కుంభేశ్వర ఆలయ ప్రాంగణంలో ఉండే పుష్కరిణిలోనే స్నానాలు చేస్తారు.

(మిగతా 35 వ పేజీలో)

"ఉన్నది ఉన్నట్టుచూడు, విన్నది విన్నట్టు ఆలోచించు."

# యేర్కాడ్ - అందమైన వేసవి విడిది

ఎన్. రామకృష్ణ

తమిళనాడులో సేలం పట్టణానికి 32 కి మీ' దూరంలో ఉన్న యేర్కాడు ప్రకృతి రమణీయమైన ఒక సుప్రసిద్ధ వేసవి విడిది. ఇది సముద్ర మట్టానికి 1500 మీటర్ల ఎత్తున షెవరాయ్ పర్వతశ్రేణిలో ఉంది. సంవత్సరం పొడవునా ఇక్కడ వాతావరణం మిక్కిలి అహ్లాదకరంగా ఉంటుంది. సుప్రసిద్ధ



ఆరోగ్య కేంద్రానికి ఉండవలసిన అన్ని లక్షణాలు ఉంటాయి.

తమిళనాడులో ఉదకమండలం, కొడైకెనాలువంటి ఇతర వేసవి విడుదులవలె గాక యేర్కాడు చాలా ప్రశాంతంగా, చిన్నదిగా ఉంటుంది. విశేష ధనవ్యయంతో కూడుకుని ఉండదు. యేర్కాడు నుండి చుట్టుప్రక్కల ప్రకృతి దృశ్యము మిక్కిలి గంభీరంగా ఉంటుంది.

మొట్టమొదట 1820 లో యూరోపియనులు యేర్కాడును కనుగొన్నారు. ఆనాటి నుండి 1829 వరకు అనేకమంది వృక్షశాస్త్రజ్ఞులు, ఇతర నిపుణులు పరిశోధనలు కావించారు. 1829 లో యేర్కాడులో కొన్ని వాసయోగ్యమైన గృహాలు నిర్మించబడ్డాయి. ఇంతలో ఈ ప్రదేశం కాఫీ తోటల పెంపకానికి యూరోపియనులకు ఇవ్వబడింది. 1858 లో రోడ్డు నిర్మాణాన్ని ప్రారంభించారు. ఇప్పటి రోడ్డు 20 కి. మీ. లు. మొత్తం 19 వంపులతో ఉంటుంది. రోడ్డు మార్గము 1900 నాటికి పూర్తి కాబడింది. రోడ్డు పొడవునా కాఫీ, నారింజ తోటలతో ప్రకృతి రమణీయంగా ఉంటుంది. మధ్య మధ్య కొండజాతులవారు ఇళ్ళు నిర్మించుకుని నివసిస్తూంటారు. యేర్కాడ్ అనే పేరు ఎర్రికాడు (అందమైన సరస్సు) నుండి ఏర్పడింది. సెలవు రోజులలో ఇక్కడకు వచ్చిన యాత్రికులు పడవలమీద ప్రయాణం చేస్తారు. ప్రవాసీ యాత్రికులకు ఇది ఆనందమైన అనుభూతిని కలిగిస్తుంది.

## మానవుని ఉత్కృష్టత

ప్రపంచాన్ని విరక్తి చెంది వదలడం కంటే అర్థంచేసుకోడం వివేకం. ముఖం త్రిప్పుకుని పారిపోవడంకంటే పరిశీలించడం ఉత్తమం. నిరసించడంకంటే ఉపయోగించుకోడం గౌరవాత్మకం. ప్రపంచాన్ని అందమైనదానిగా, ఉత్తమోత్తమైనదిగా గ్రహించడమే మానవుని ఉత్కృష్టత.

"శత్రువుకోసం అంటించిన మంట వేడి ముందుగా తగిలేది నీకే."

చెరువుకు దగ్గరగా అన్నా పార్కులో రకరకాల పూవుల మొక్కలు అందమైన పూవులతో కన్నుల పండుగగా ఉంటుంది. ఈ పుష్పాల తోటలో విహారం అత్యంత ఆహ్లాదకరంగా ఉంటుంది.

యేర్కాడులో ముఖ్యమైన ప్రదేశం లేడీస్ సీటు. కొన్ని పర్వతాలు చేరి ఒక కుర్చీలా ఏర్పడి అతిథులను ఆహ్వానిస్తున్నట్లు ఉంటుంది. దీని క్రిందలోయ వృక్ష సంపదతో పచ్చగా కన్నులకు ఇంపుగా ఉంటుంది. మేఘాలు లేని స్వచ్ఛమైన రోజున మెట్టూరు డామ్, మాగ్నసైటు గనులు ఇక్కడనుంచి చూడవచ్చు.

యేర్కాడు ఊరికి మధ్య 'అర్థర్స్‌సీటు' ఉంటుంది. చేరువగానే అందమైన పర్వత ప్రదేశాలలో కిలియూర్ జలపాతం చూడవచ్చు. పగోడా పాయింటు మరియొక దృశ్య కేంద్రం. ఇది యేర్కాడుకు 4½ కి.మీ. ల దూరంలో ఉంటుంది. ప్రాచీన కొండజాతులకు చెందిన ఒక దేవాలయం ఇక్కడే ఉంది. 18 కి.మీ. ల దూరంలో 'కావేరీ శిఖరం' ఉంది. ఇక్కడ నుంచి కావేరీ నదిని చూడవచ్చు. ఇక్కడ ప్రారంభమై అంత మయ్యే లూపురోడ్డు చుట్టుపట్ల అనేక వింత ప్రదేశాలను చూడవచ్చు.

గ్రాంజి (Grange) అనే ఒక కోటను సేలం కలక్టరు ఎమ్.డి. కాక్‌బర్న్ నిర్మించాడు. ఇతడే మొట్టమొదట (1820-1829) A.D. మధ్య అరేబియానుంచి కాఫీని, దక్షిణ ఆఫ్రికా నుంచి ఆపిల్స్ మరియు ఇతర ఫలాలను ఇక్కడ ప్రవేశపెట్టాడు. యేర్కాడులో మౌంట్ ఫోర్టు స్కూలు మంచి పేరుపొందిన విద్యాసంస్థ.

యేర్కాడు కొండలలో లభించే బాక్సైటు నుంచి అల్యూమినియం లోహాన్ని తీస్తారు. బొటానికల్ సర్వే ఆఫ్ ఇండియా వారు యేర్కాడులో రకరకాల పుష్పజాతుల చెట్లతో 'ఆర్కిడేరియం' నెలకొల్పారు. యూరోపియనులు ఇక్కడ వేలకొద్దీ ఓకు వృక్షాలను పెంచారు. యేర్కాడు కొండలమీది ఈ వృక్షాల గట్టి కలప చాలా ప్రసిద్ధిపొందింది.

## అత్యధిక ప్రతిఫలం దక్కిన ఒకే ఒక చిత్రం



MARLON BRANDO

'ది గాడ్ ఫాదర్' అనే హాలీవుడ్ చిత్రంలో డాన్ కోర్లియన్ (Don Corleone) అనే మాఫియా నాయకుడుగా నటించిన మార్లాన్ బ్రాండోకి ఒకే ఒక చిత్రానికి 10 మిలియన్ డాలర్లు ప్రతిఫలం దక్కింది. ఈ చిత్ర ప్రదర్శనవల్ల మొదటి సంవత్సరం బాక్స్ ఆఫీసుకు చేరిన మొత్తం 100 మిలియన్ డాలర్లు కలెక్షన్లలో కొంత శాతం అతడి పేరుగా ఇవ్వబడింది.

"వివేక జ్ఞానం ఉన్నవాళ్ళు అసాధ్యమైనదానిని అపేక్షించరు."

# తల్లిదండ్రులకు సూచనలు

తల్లిదండ్రులు చేయవలసిన, చేయకూడని పనులకు సూచనలు కొన్ని ఇక్కడ ఇవ్వబడ్డాయి. ఇవి భాషనుబట్టి. తెలివితేటలను బట్టి, స్నేహభావాలను బట్టి, కలుపుగోలుతనాన్ని బట్టి, సామర్థ్యవంతులైన పిల్లల తలిదండ్రుల అనుభవాలనుబట్టి మేము తెలుసుకున్నాము.





చేయవలసినవి: మీ పిల్లలు పరిశీలనాత్మకంగా పరిశోధించి తెలుసుకోవడానికి సాధ్యమైనంతవరకు నిరపాయకరంగా ఉండే సౌలభ్యమైన అవకాశాలు కల్పించండి.

అల్మైరాలలోను, బీరువాలలోను క్రింది అరలలో సులభంగా పగిలిపోయే గాజు సామానులు, ఇతర అపాయకరమైన వస్తువులు తీసి వాటి స్థానంలో పాత మాగజైనులు, ప్లాస్టిక్ కొలత కప్పులు, ఇతర ఆటవస్తువులు సర్దిపెట్టండి.

మీ పిల్లలకు ప్రత్యేకమైన సలహాదారుగా మాత్రమే ఉండడానికి ప్రయత్నించండి. సహాయపడడానికి, జాగ్రత్తగా చూసుకోవడానికి వారిచుట్టూ అస్తమానం తిరగనక్కరలేదు. పిల్లలకు అవసరమైనప్పుడు కావలసిన ఉత్సాహం కలిగిస్తూ ధైర్యాన్నిఇస్తూ అడిగినదానికి వివరంగా జవాబు మాత్రం చెబుతూండండి. ప్రతీదానికి హద్దు ఉండాలి. హద్దుమీరి ప్రవర్తించనీయవద్దు.

(32 వ పేజీ తరువాయి)

ఈ పుష్కరాలకు భారతదేశంలో వివిధ ప్రదేశాల నుంచి కోటానుకోట్ల యాత్రికులు వస్తారు. నిర్ణయించిన రేవులలో పురోహితులచేత సంకల్పం చేయించుకుని స్నానాలు చేస్తారు. భక్తితో నదిని పూజిస్తారు. నైవేద్యాలు పెడతారు.

రాజమండ్రిలో గోదావరి పుష్కరాలు క్రిందటిసారి 1980 లో వచ్చాయి. కాబట్టి 1992 లో తిరిగి పుష్కరాలు వస్తాయి. సాధారణంగా జూలై మాసంలో జరుగుతాయి. ఈ పుష్కరిణి సమయంలో ధవళేశ్వరం, ద్రాక్షారం, కోటిపల్లి, ముక్తేశ్వరం రేవులలో కూడా స్నానాలు జరుగుతాయి. గోదావరికి అద్దరి (అవతలి ఒడ్డు) పశ్చిమ గోదావరి జిల్లాలో క్రొవ్వూరు, రాజమండ్రి కోటి లింగాలకు ఎదురుగా ఉంటుంది. ఇంతే కాకుండా తీపర్రు, సిద్ధాంతం, లక్ష్మీపాల్యం, నర్సాపురం, వాడపల్లి కూడా చాలా ముఖ్యమైన పుణ్యక్షేత్రాలు. 12 సంవత్సరాల కొకసారి 12 రోజులపాటు జరిగే అపూర్వ అవకాశం జారవిడుచుకోవద్దు! తాడూరి

"ఆత్మ పరీక్షలేని జీవితం నిరుపయోగం."

మీ పిల్లలతో తరచుగా మాట్లాడుతూం డండి. పిల్లలు ఏం చేయడానికి ప్రయత్ని స్తున్నారో తెలుసుకుని వారికి సహక రించండి.

వారికి అర్థమయ్యే మాటలతోనే చెప్పండి. అప్పుడప్పుడు క్రొత్త మాటలు వాడుతూండండి. ఉదాహరణకి. మీ పాప ఎర్రబంతి ఇస్తే ఈ బంతి ఎర్రగా ఉంది నా చొక్కాలాగ. నీ చొక్కా నీలంగా నీ పాంటు రంగుతో సమంగా ఉంది అని వారికి అర్థమయ్యేలా చెబుతూండండి.

క్రొత్త విషయాలు తెలుసుకోడానికి అవ కాశాలు, సన్నివేశాలు కల్పించండి. ఊరికే కూర్చోబెట్టడం కాకుండా పిల్లలను సూపర్ మార్కెట్ కి తీసుకువెళ్ళడం, చిన్న చిన్న పనులు పురమాయించడం మంచిది.

మీరు చేసే పనులలో అప్పుడప్పుడు సహాయం చేస్తూండనివ్వండి.

మీ అలవాట్లకు అనుగుణంగా, అప్రయ త్నంగా పిల్లలకు సహకరించండి.

మీ పిల్లల ఆటలను, అనుకరణ సామ ర్థ్యాన్ని ఉత్సాహపరచండి.

చేయకూడనివి: పిల్లలను అస్తమానం నిర్బంధపెట్టకండి,

ప్రతీదానికీ స్వప్రయత్నం లేకుండా మీ మీదే ఆధారపడనీయకండి.

మీ శ్రద్ధను తమవైపు త్రిప్పుకోడానికి చేసే ప్రయత్నాలను చూచీ చూడనట్లు వదలి పెట్టవద్దు.

ముఖ్యంగా రెండవ ఏట పిల్లలతో వాదించి విజయం పొందడానికి ప్రయత్నించ వద్దు. వ్యతిరేకభావం ఏర్పడే సమయం అది.

గోలచేసి అల్లరి చేస్తూంటే ఎన్నడూ అపడానికి ప్రయత్నించవద్దు అది మంచి ఆరోగ్యవంతమైన జిజ్ఞాసాత్మకమైన కుతూ హలం గల పిల్లల లక్షణం.

ఎక్కువగా మీ పిల్లలను లాలన చేయ వద్దు.

పిల్లలని అనవసరంగా బోరుకొట్టి విసి గించవద్దు.

మాట్లాడే భాష అర్థంచేసుకుంటూన్నంత సేపూ మాట్లాడడం ఆలస్యమైనా ఇబ్బంది లేదు.

నిత్య కాలకృత్యాలను నేర్పడానికి ప్రయత్నించవద్దు రెండవ సంవత్సరానికి వాటంతటదే అలవాటవుతాయి.

ప్రపంచం అంతా నీ కోసం అన్నట్లుగా గారాబం చేసి మీ పిల్లలను చెడగొట్టకండి.

—'హెల్త్' సౌజన్యంతో

చిరుతపులి దృష్టి మిక్కిలి సూక్ష్మమైనది



చిరుతపులి దృష్టి మిక్కిలి సూక్ష్మ మైనది. 100 గజాల దూరంలో ఉన్న మనిషి కళ్ళ రెప్పపాటును కూడా బాగా చూడ గలదు!

''నిరంతర జ్ఞానంద్వారా ఆత్మ పరమాత్మ అవుతుంది.''

# యాత్రా స్థలాలు

## శబరిమల

శబరిమల దేవాలయంలో అయ్యప్ప దేవుని పూజిస్తారు. ఇది భారత దేశానికి దక్షిణ దిక్కుగా కేరళ రాష్ట్రంలో కొట్టాయం జిల్లాలో శబరి కొండలమీద ఉంది. సాక్షాత్తు పరశురాముడు మకర సంక్రాంతి (జనవరి



మధ్య) రోజున శుభ సమయంలో అయ్యప్ప విగ్రహాన్ని ప్రతిష్ఠ చేశాడని ప్రతీతి.

అయ్యప్ప పరమశివుని మూడవ కుమారుడు అంటారు. అయ్యప్ప అనే పేరు ఆర్య (పూజనీయుడు), అప్ప (తండ్రి) అనే రెండు మాటలనుండి ఏర్పడింది. మకర సంక్రాంతి రోజున భక్త బృందాన్ని అనుగ్రహించడానికి శబరి కొండలమీదికి వేంచేస్తాడని భక్తుల విశ్వాసం. పురుషులు, 10 సంవత్సరాల వయస్సులోపలి బాలికలు, 55 సం.ల వయస్సు మళ్ళిన వృద్ధ స్త్రీలు మాత్రమే దేవాలయాన్ని సందర్శించడానికి అర్హులు. యౌవ్వనంలో ఉండే స్త్రీలు రాకూడదు.

భక్తి విశ్వాసాలతో దీక్ష వహించినవారే పవిత్రమైన శబరిమల దేవాలయం 18 మెట్లు ఎక్కుతారు. కొంతమంది భక్తులు అయ్యప్ప దర్శనానికి పలుసార్లు వస్తారు. కష్టసాధ్యమైన మెట్లు ఒక్కొక్కటే ఎక్కి చివరకు భక్తుడు అయ్యప్ప సన్నిధి చేరి దర్శనం చేసుకుని పూజిస్తాడు. బ్రహ్మయొక్క సృష్టి శక్తి,

## సుభాషితాలు

"వ్యాధి కలిగినేని వైద్యునిచేతను
మందు తినక కాని మానదెందు
చెంత దీపమిడక చీకటి పాయునా
విశ్వదాభిరామ వినురవేమ."

[మందు తింటేగాని రోగం కుదరదు. దీపం లేకుండా చీకటిపోదు. అలాగే జ్ఞానం లేకుండా విద్వాంసుడు కాజాలడు.]

• • •

"మత్సరంబు మదము మమకార
మవియెడి
వ్యసనములను దగిలి మనలోక
వరుల నుపకరించి వరమందవగువాడు
విశ్వదాభిరామ వినురవేమ."

[మమకారం, మదం, మాత్సర్యాలకు లొంగకుండా పరులకు ఉపకారంచేస్తే గొప్పవాడవు అవుతావు.]

"సంకల్పబుద్ధి, మానసిక శాంతి లేని విజ్ఞానం వ్యర్థం."

విష్ణువు యొక్క స్థితిస్థాపక శక్తి. శివుడి యొక్క లయశక్తి మూడు అయ్యప్పయందు మూర్తీభవించి ఉంటాయని భక్తుల దృఢ విశ్వాసం.

జాతి, మత, కుల భేదాలు లేకుండా వేల కొద్దీ భక్తులు వివిధ రాష్ట్రాలనుండి వచ్చి శబరిమల దేవాలయాన్ని సందర్శించి ధన్యు


EIGHTEEN STEPS
SABARIMALA TEMPLE

లవుతారు. శబరిమలకు వెళ్ళడానికి దీక్షతీసుకుని నియమముతో ఉండే భక్తుని 'అయ్యప్ప'. 'అయ్యప్పస్వామి' అంటారు.

జీసస్ క్రీస్తు, గౌతమబుద్ధుడు, శ్రీ కృష్ణుడు ఆశ్చర్యకరమైన అద్భుత పరిస్థితులలో అవతరించారు. అదేవిధంగా అయ్యప్ప కూడా అవతరించాడు. శబరి కొండల్లో పంపానది ప్రవహిస్తుంటుంది. ఒకరోజున ఈ నదిగట్టుమీద విహరిస్తున్న పంటాలమ్ రాజా, బాలుడైన అయ్యప్పను కనుగొన్నాడు. అయ్యప్పను చిన్నప్పుడు మణికంఠుడు అని పిలిచేవారు. పంటాలమ్ రాజభవనంలో అందరూ మణికంఠుని ఆదరాభిమానాలతో ప్రేమించేవారు. మణికంఠుడు పెరిగి పెద్ద వాడైనాడు. వేదశాస్త్రాలు, పురాణాలు చదివి గొప్ప విద్వాంసుడుగా ప్రసిద్ధి పొందాడు. శత్రువులను జయించి ఓడించగల ధైర్య సాహసాలను అలవరచుకున్నాడు. మణికంఠుని సవతితల్లి ఎలాగైనా ఇతడిని చంపదలచి పన్నాగంపన్ని తన తలనొప్పి బాధకు పులిపాలు తెమ్మని అడవులకు పంపుతుంది. అడవులకు పోయిన మణికంఠుడు పులిపై స్వారీచేస్తూ ఇంటికి తిరిగివస్తాడు. పులిపాలు పితికి సవతితల్లికి సమర్పిస్తాడు. ఆ తరువాత అతడు సన్యాసిగా మారిపోయి అడవులకు వెళ్ళాడు. పంటాలమ్ రాజా అయ్యప్ప జ్ఞాపకార్థం ఇక్కడ ఒక దేవాలయాన్ని నిర్మించాడు. ఈ దేవాలయమే అయ్యప్ప దేవాలయం. 41 రోజులు (మండలం) దీక్ష వహించిన శబరిమల యాత్రికుడు అబద్ధమాడకూడదు. బ్రహ్మచారిగా ఉండాలి. అప్పుడే

## ముఖచిత్ర వ్యాఖ్య

(మార్చి 1989)

"ముసిముసి నవ్వుల ముద్దుబాబు
అమరవీరుల ఆశయాలకు జవాబు."
—కోరాడ దుర్గారావు, అనకాపల్లి.

* * *

"కావి తరానికి కావలసిన వికాసం
పసితనంలోనే కలిపిస్తుందా ప్రకాశం."
—కర్రి క్రిష్ణమ్మ, వీరఘట్టం.

* * *

"వేషంలో చిన్నారి సుభాష్
చేతలతో అర్పించుకో శభాష్."
—వై. భాగ్యరేఖ, ధర్మవరం.

"అజ్ఞాని సుజ్ఞానమును గ్రహించలేడు సరసమార్గమును అనుసరింపక."

ఆ భక్తుడు ఆత్మసాక్షాత్కారంతో దివ్యానుభూతిని పొందగలడు.

శబరిమల యాత్రికులు ఉత్సాహంతో, భక్తి ఆవేశంతో 'శరణం అయ్యప్ప' 'శరణం అయ్యప్ప' అని స్మరణ చేస్తూ మార్గాయాసాన్ని మరిచిపోతారు. భక్తులు యాత్రకు కావలసిన తిండి, దేవుని నైవేద్యాలు, కట్టుబట్టలు, దుప్పటి మూటగట్టి తలపై పెట్టుకుంటారు. కంఠంలో తులసి మాల ధరిస్తారు. తాత్కాలిక వైరాగ్య సూచనగా నల్లటి బట్టలు ధరిస్తారు. నిష్ఠతో కూడిన శబరిమల యాత్రవల్ల భక్తుడికి వ్యక్తిగత శ్రమలో ఆత్మగౌరవం పెరుగుతుంది. జాతి, మత, కుల ప్రమేయం లేని స్వార్థరహితమైన సాంఘిక జీవితానికి అవతారమూర్తి అయ్యప్ప.

యాత్రికుడు శబరిమల 18 మెట్లు శారీరక విగ్రహంతో, ఆత్మనిగ్రహంతో ఎక్కి దివ్యానుభూతిని పొందుతాడు. మకర సంక్రాంతి రోజున (మకరవిళక్కు) మకర దీపాలతో ఆభరణాలతోను అయ్యప్పను అలంకరిస్తారు. ఈ రోజున భగవంతుడు శబరిమలకొండలలో ఈశాన్య దిక్కుగా అరగంటసేపు దివ్యజ్యోతిగా ప్రకాశిస్తాడు.

దక్షిణ రైలుమార్గంలో కొట్టాయం నుంచి శబరిమల కాలిదారిన చేరవచ్చు లేక బస్సుమీద వెళ్ళవచ్చు. భారతదేశంలో ప్రతి సంవత్సరం వివిధ ప్రదేశాల నుంచి వేలకు వేలు అయ్యప్ప భక్తులు శబరిమల దర్శించి ఇతోధిక విశ్వాసంతో అహంకార వర్జితులై, ఆత్మసమర్పణ భావంతో పునీతులై మానసిక సంతృప్తిని పొందుతారు.

## 'టాకింగ్' గొరిల్లా

యుఎస్ఎ కాలిఫోర్నియా జంతుప్రదర్శనశాలలో 'కోకో' అనే పేరుగల గొరిల్లాకి మూగ - చెవిటివారి భాషలో మాట్లాడడం నేర్పించారు. అది పిల్లలతో ఆడుతూంటే 'పాప' అని సౌంజ్ఞచేసి చెబుతుంది.

—'మిషా' సౌజన్యంతో

## పని చెయించుకోడం ఎలా ?



1. ఉద్యోగస్థులను అందరినీ కూడదీసి ప్రతి ఒక్కరినీ సకాలంలో సక్రమంగా ప్రవర్తించేటట్టు చేయి.

2. లక్ష్యాన్ని వదలకుండా సాధించేందుకు పూర్తిగా అనుసరించు.

3. విశ్వతా స్థాయిని నిలబెట్టు.

4. ప్రతిదానికి కాలపరిమితి ఏర్పరచి ఆ కాలావధిలో ఆ పనిని పూర్తిచేసేటట్టు గమనించు.

5. సంబంధించిన వారందరి సహాయాన్ని, తోడ్పాటును పొందు.

6. ఎప్పుడూ పని మిగల్చకుండా కొంచెం అధికంగా చేస్తూండు. —డి. స్టార్ప్

"అందరూ ధరించగల అమూల్యమైన భూషణం నమ్రతాభరణం."

# కలంస్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. సంపాదకుడు.]

1. మర్రి మహేశ్వరరెడ్డి, బి.ఏ. మూడవ సంవత్సరం, 21 సం.లు., ఇం. నెం. 1-3-151/D, రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్-509 001.

కవితలు చదవడం, వ్రాయడం, పుస్తక పఠనం, సుభాషితాల సేకరణ.

2. ఎల్. బాల్‌కిషన్, ఇంటర్ రెండవ సంవత్సరం, 21. సం.లు., ఇం. నెం. 3-1-115, నింబోలిలిడ్డ, కాచిగూడ, హైదరాబాద్-27.

రేడియో వినడం, కవితలు, విజ్ఞాన దాయకమైన పత్రికలు చదవడం.

3. ఎల్ జీవన్‌రెడ్డి, 20 సం. లు., గంభీరరావుపేట మండలం, (కరీంనగర్ జిల్లా) 505 304

కలంస్నేహం, పత్రికలకు ఉత్తరాలు వ్రాయడం.

4. కె. సదాశివ, S/o కె. కిష్టయ్య, టీచరు, గంజ్‌హౌస్, ఇం.నెం. 4-1-99, పోస్టు మరియు తాలూకా తాండూర్ 501 141.

కవితలు వ్రాయడం, దినపత్రికల సేకరణ. చదరంగం ఆడడం.

5. ఎ. హరిదాస్. బి.కామ్., 22 సం. లు., ఇం. నెం. 18-5-231, అలియాబాద్, హైదరాబాద్-500 253.

కలంస్నేహం, చదరంగం ఆడడం, పుస్తక పఠనం.

6. శ్రీ మహేశ్వర, ఆ యి ల్ అండ్ రైస్‌మిల్, మెట్టుపల్లి పోస్టు, జి. యాదగిరి తాలూకా, (కరీంనగర్ జిల్లా) 505 325.

కరాటే, చిత్రలేఖనం, మంచిస్నేహం.

ఆంగ్లభాషలో "glamour" అనే పదం



మనోహరము అని అర్థమిచ్చే "glamour" అనే పదం grammar అనే పదం మంచి ఏర్పడిన అపభ్రంశం. దీనిని మొట్టమొదట సర్ వాల్టర్ స్కాట్ తన నవలలో ఉపయోగించాడు. క్రమ క్రమంగా అనేకమంది రచయితలు దీనిని ఆదర్శంగా గ్రహించి వాడారు. ఇప్పుడు దీనిని అందమైన ఫ్లిం జీవిత విధానం తెలియజేయడానికి వాడతారు.

"అపజయానికి క్రుంగిపోకుండా నవ్యోత్సాహంతో తిరిగి ప్రారంభిస్తే బ్రహ్మాండమైన ఆత్మబలంతో సాధించలేనిది లేదు."

# గృహాలంకరణ

కోసూరి శీలామాధవ్

'ఇల్లు కట్టి చూడు పెళ్ళి చేసి చూడు' — ఎంత అనుభవంతో చెప్పిన మాట ఇది. పెద్ద ఎత్తున గవర్నమెంటువారు కట్టేసిన ప్లాటు లాట్‌లో వస్తే డబ్బు చెల్లించి చటుక్కున ప్లాట్‌లో చేరడం కాదు. స్వంతంగా ప్లాటు సంపాదించుకుని ఆ విశాలమైనప్లాటులో ఎప్పటికప్పుడు స్వంతంగా సూపర్‌వైజ్ చేసుకుంటూ స్వంత ఇల్లు లేవదీయడం మాటలా? దానికి పడే తాపత్రయాలు, కష్టసుఖాలు, పొందే లాభనష్టాలు ఆ కట్టినవారికే తెలుస్తాయి. అందరికీ తెలిసి వచ్చేవికావు అనుభవపూర్వకంగా ఎవరికివారు తెలుసుకోవాలి.

అన్ని ధక్కా మొక్కీలకు తట్టుకుని గృహప్రవేశం చేసుకున్న ఇంటిని నిత్య కల్యాణం పచ్చతోరణం చేసుకోవాలి. నిరాశ పడిపోకుండా ఆశాకిరణాల జ్యోతిలో చిరునవ్వుతో ఆనందంగా జీవించడం నేర్చుకోవాలి. ఇటువంటి ఇంటిలో గాజులు గలగలలాడుతుంటేనే ఇల్లు కళకళలాడుతూ ఉంటుంది ఓర్పుతో నేర్పుతో ఇంటిని చక్కబెట్టే ఇల్లాలు లేకపోతే ఇల్లు చిన్నబోతుంది. ఇల్లాలే చెబుతుంది ఇంటి కళ. ఇంట్లోకి వెళ్ళక్కరలేదు. ఇల్లాలి ముఖం చూడక్కరలేదు. వాకిలి చూస్తే చాలు, ఇల్లాలిని గురించి తెలిసిపోతుంది. గృహ సామ్రాజ్యానికి గృహిణి రాణి. 'గృహం భార్యే' అని వేదాలు చెబుతున్నాయి. 'ఇల్లు ఇల్లు కాదు భార్యయే గృహము' అని యాజ్ఞవల్క్యుడు చెప్పాడు. ఇంటికి ఇల్లాలే దీపం అనే శాస్త్రం ఉంది. ఇల్లుచూసి ఇల్లాలిని చూడమనే సూక్తి ఉంది. నిజమే ఆనాడు స్త్రీలు పూతగోడల మీద ఎవరి శక్తికొలది వారు గోడలను ముగ్గులతో అలంకరించి గుమ్మాలకు పసుపుపూసి, దానిమీద రకరకాల రంగు రంగుల ముగ్గులు తీర్చి గుమ్మాలకి ఎరుపు తెలుపు చుక్కలు పెట్టి సింహద్వారాలకు బంతి పూల దండలు, మామిడి తోరణాలు అలంకరించేవారు.

ఇదంతా పాతకాలపు మాట. ఈనాడు పురుషులతో సమానంగా వివిధరంగాలలో విశ్రాంతి లేకుండా పనిచేస్తున్న స్త్రీకి గృహ నిర్వహణ భారం అనిపిస్తుంది. ఇప్పుడు ఇది ఇంట్లో అందరి బాధ్యత. కట్టుకున్న ఇంటిని కళాత్మకంగా తీర్చిదిద్దడం ఇంట్లో అందరూ నేర్చుకోవాలి. లక్షోపలక్షలు వెచ్చించి కట్టించుకుని నివసిస్తున్న ఇల్లు బావురుమంటూ ఉండకూడదు. జీవకళతో చైతన్యవంతంగా దేదీప్యమానంగా ఉండాలి. మానవుని సుఖజీవనానికి ఇల్లే ముఖ్యం.

ఇంట్లో గదులు వాటి ఉపయోగం, పరిమాణం, గోడలు, కిటికీలు, అల్మారాలు, గుమ్మాలు, కర్టెనులు, లైటింగ్ మొదలైన వాటినిబట్టి మెరుగులు దిద్దుకోడానికి, అలంకరించుకోడానికి ముందు రకరకాల రంగులు, వాటి ప్రభావం తెలుసుకోడం ముఖ్యం.

ప్రపంచ రహస్యమంతా సత్త్వరజస్తమో గుణాత్మకము. ఈ రహస్యాన్నే వివిధ రంగులు తెలియజేస్తాయి. ఇదేవిధంగా ఈ

"మనస్సును, వాక్కును, చేతలను పరిశుద్ధం చేసుకొనడమే త్రికరణ శుద్ధి."

మూడు గుణాల కలయికవల్ల పాళ్ళభేదమును అనుసరించి అనేక రసాలు అవస్థాను గుణంగా మానవులలో ఉద్భవిస్తున్నాయి. వర్ణ వైధ్యమును అనుసరించి ఎరుపు వేడిని కలిగిస్తుంది, నీలం చల్లదనం కలిగిస్తుంది. పసుపు రెంటిని సమానంగా ఉంచుతుంది. గుణాలు సమపాళ్ళలో ప్రవర్తిల్లినప్పుడే మన ఆరోగ్యం పరిపూర్ణంగా ఉంటుంది. వివిధ రంగుల ప్రసారంవల్ల, వాటి ప్రభావం వల్ల మన ఆరోగ్యంకూడా మారుతూంటుంది. మన ఆరోగ్యాలకి, మన గుణాలకి, రంగులకి అవినాభావ సంబంధం ఉంది. తెలుపు సత్త్వ గుణాన్ని తెలియజేస్తుంది. ఇది అన్నిరంగుల మిశ్రమం. ఎండను విరోధిస్తుంది. స్థలం విస్తారంగా ఉన్నట్టు అనిపిస్తుంది. తెల్లరంగు వేస్తే ఇరుకుగా ఉండే హాలు, ఇతర గదులు ఎంతో విశాలంగా కనిపిస్తాయి.

ఊదారంగు నీలం, ఎరుపు సమపాళ్ళలో కలిస్తే ఏర్పడుతుంది. ముదర ఊదారంగు గందరగోళంగా ఉంటుంది. అంతా గజిబిజిగా ఉంటుంది. లేత ఊదారంగు మనస్సును ఆహ్లాదకరంగా ఉంచి ఏకాగ్రతకు అనువుగా ఉంటుంది. కాబట్టి దేవుడి గదికి, స్టడీరూముకి ఊదారంగు బాగా నప్పుతుంది.

నీలం విశ్రాంతిని కలిగిస్తుంది. రోజంతా శ్రమపడి ఇంటికివచ్చిన తరువాత విశ్రాంతి, నెమ్మది అవసరం. పడకగదికి నీలం వేసుకోండి. బడలిక తీరుతుంది. హాయిగా ఉంటుంది.

పసుపురంగు నీలిరంగు కలిపితే ఏర్పడేది ఆకుపచ్చరంగు. లేత ఆకుపచ్చ కలతచెందిన మనస్సుకు శాంతిని చేకూరుస్తుంది. చల్లగా ఉన్నట్టు అనిపిస్తుంది.

పసుపురంగు వెచ్చదనాన్ని ఇస్తుంది. గదులకు ఒక రకమైన అందాన్ని ఇస్తుంది. ఇది ముఖ్యంగా సత్వ రజ స్తమో గుణాల సమరసాన్ని సూచిస్తుంది.

ఎరుపుతో కూడిన పసుపురంగు వల్ల ఏర్పడే నారింజరంగు బాగా కాంతిగా ఉంటుంది. ఎరుపురంగులో తెలుపు కలుపుతూ వస్తే కాషాయ రంగు వస్తుంది ఇది కేవలం సత్వంకాదు. ఇది కేవలం రజోగుణం కాదు. ఇది కూడా సమభావాన్ని తెలియజేస్తుంది. సంతోషాన్ని ఆనందాన్ని అధికం చేస్తుంది. చిన్న పిల్లల గదులకు, లాబీలకు చాలా అనువుగా ఉంటుంది.

నల్లటి నలుపు - ఎరుపు, పసుపు, నీలం

## దగ్గుకి ఔషధం



ద్రాక్షపండ్ల రసం ఊపిరితిత్తులకు శక్తిని ఇస్తుంది. దీనిని ఔషధంగా సేవిస్తే సాధారణ జలుబు, దగ్గు పూర్తిగా తగ్గిపోతాయి. తేనె కలిపిన ద్రాక్షరసం దగ్గుకి దివ్య ఔషధం. —జి.ఎస్. వర్మ

"పాపం చేసినవారు ఒకరైతే, ఆ పాపఫలితం అనుభవించేవారు అనేకం."

కలసి ఏర్పడుతుంది. ముఖ్యంగా తామస గుణాన్ని తెలియజేస్తుంది.

ఇటుక రంగు సాధారణంగా ఎరుపు, పసుపు, నలుపుకలిస్తే వస్తుంది. ఫర్నిచరుకి, బట్టలగదికి బాగా ఉంటుంది. గది అంద గిస్తుంది!

ఇక ఏ రంగు దేనికి నప్పుతుందో తెలుసుకోలేక తికమకలు పడుతూంటే కంగారు పడకండి. లేతపసుపు, బూడిదరంగు కలపగా వచ్చిన లేత బూడిద ఇటుకరంగు (Beige) ఏ గదికైనా విరభ్యంతరంగా వేయవచ్చు. దీనివల్ల వాతావరణం ఒక విధమైన చైతన్య వంతంగా ఉంటుంది.

రంగులు వాటి ప్రభావం తెలుసుకున్న తరువాత ఇంట్లో గోడలకు ఏయే రంగులు వేయాలి? వేటికి ఎంత ఖర్చు అవుతుంది? అది ఎంతవరకు ఉపయోగపడుతుంది? అందరికీ సంతోషం, ఆనందం కలసివస్తాయా? అందరూ చేరి ఆలోచించుకోండి. నిపుణుల సలహాలను తీసుకోండి. వివేకంతో పరిశీలించి ప్రారంభించండి. ముదురు రంగుల కోసం మురిసిపోవద్దు. లైట్ కలర్స్ మాత్రమే వాడండి. జాగ్రత్తగా ఆలోచించి మీగది, హాలు గోడలకు అందరి మనస్సుకు నప్పే రంగే వాడండి. చూచేవారికి ముద్దుగా ఆకర్షణీయంగా ఉండాలి. ముదురు రంగులు వాడితే వైశాల్యం కుదించుకు పోయినట్లు అనిపిస్తుంది. ఎంతమంచి దీపాలు అమర్చినా మసగ్గా కనిపిస్తాయి. జీవకళ నశించిపోతుంది. ఇల్లంతా ఒకే రంగు వాడవద్దు! విసుగ్గా ఉంటుంది. ఇంటి రంగుల నిర్ణయం ఆ ఇంటి కుటుంబ లక్షణాలను తెలియజేస్తుంది. రంగుల బెడద లేకుండా రకరకాల రంగులలో డిజైను లలో వాల్ పేపర్ దొరుకుతుంది. ఇది చౌక కూడా. గోడల క్రిందిభాగాలలో వాల్ పేపరు పెట్టి పైనిదానికి అనుగుణమైన లేతరంగు వేయండి. డ్రాయింగ్ రూములో ఫర్నిచరు, పడకగదిలో మంచాలు హాలులో కార్పెట్లు, బాత్ రూమ్, వంటగదిలో షెల్ఫులు, వంట పాత్రలు ప్లాట్ ఫారం, సింకు, వాష్ బేసిన్ అన్నీ ముందుగానే ప్లానువేసుకొని దాని ప్రకారం అమర్చుకోవాలి. ఇల్లు కట్టేస్తే చాలదు, ఇన్ని మెలకువలు తీసుకోవాలి.

ఫర్నిచర్ దగ్గరకు వస్తే గోడలరంగుకి అనుగుణంగా నప్పేటట్టు చూడండి. ఏ గదిలో ఏ ఫర్నిచర్ పెట్టాలని ఆలోచించండి. కావలసిన స్విచ్ లు ఎక్కడ పెట్టాలి, ఎన్ని స్విచ్ లు పెట్టాలో ఆలోచించి చేతికి అనువుగా అందేటట్టుగా స్విచ్ లు అమర్చండి. దీపాలలో రకరకాల దీపాలు లభిస్తున్నాయి.

(మిగతా 44 వ పేజీలో)

## ఒక్క క్షణం కూడా వెనుకకు దృష్టి మరల్చవద్దు



మానవమాత్రులమైన మనం ఒక్కక్షణం వెనుకకు దృష్టి మరల్చకుండా ప్రగతి మార్గంలో ముందుకుపోతూ మానవుని విశేషాధికారమైన స్వసామర్థ్యంతో బ్రహ్మాండమైన భవిష్యత్తును నిర్మించు కుందాం. —స్వామీ చిన్మయానంద

"అసూయలో ప్రేమకన్నా స్వార్థం అధికం."

# వీరిని గురించి తెలుసుకోండి

డ్వైట్ డేవిడ్ ఐసెన్‌హోవెర్ (1890-1969):

యునైటెడ్ స్టేట్స్ 34వ ప్రెసిడెంటు. రెండవ ప్రపంచ మహా యుద్ధంలో యూరప్‌లో ఎల్లైడ్ ఆర్మీలకు సుప్రీమ్



EISENHOWER

కమాండరు. మిలటరీ వ్యూహ రచనలో మంచి నిపుణుడు. తన పదవీ కాలంలో అంతరిక్ష పరిశోధనలకు మొట్టమొదటి పథకాలను ఏర్పాటు చేసాడు.

* * *

డగ్లస్ ఫెయిర్‌బాంక్స్ (1883-1939):

హాలీవుడ్ సినిమా నటుడు. ధైర్య సాహసాలకు, శరీర లాఘవానికి పేరు పొందాడు. 'ది మార్క్ ఆఫ్ జోర్రో', 'ది త్రీ మస్కటీర్స్' 'రాబిన్ హుడ్' ఇతడి మరపురాని చిత్రాలు.

* * *

(43 వ పేజీ తరువాయి)

ఎక్కడ ఎలాంటి లైటింగు అవసరమవుతుందో ఆలోచించి వాడడం మంచిది. ట్యూబులైటు, సాధారణమైనలైటు హాలులో గానీ, గదిలోగానీ వెలుతురుకోసం వేసుకోవాలి. చదువుకోడానికి, ఇతర ప్రత్యేకమైన పనులకు ఏర్పాటైన లైట్లు వాటికి అనువుగా ఉండేటట్లు వేసుకోవాలి.

ఇంటి గోడలనిండా ఏవేవో పటాలు, క్యాలెండర్లు తగిలించి గజిబిజిగా చేసుకోవద్దు. గోడలకు అందమైన చిత్రాలు ఒకటిరెండు తగిలించండి. వీటిమీదకి కాంతి పడేటట్లు పెట్టండి. గోడల మూలలో ఫ్లవర్ వేసులు అమర్చండి. ఇప్పుడు ఇండోర్ ప్లాంటులతో లోపల పెరిగే మొక్కలుకూడా వస్తున్నాయి. చిన్న చిన్న అందమైన కుండీలలో పెట్టి ఎప్పటికప్పుడు అందంగా పెరిగేటట్టు అమర్చండి. రంగులు, ఫర్నిచర్, కర్టెనులు, ఫ్లవర్ వేసులు, ఇండోర్ ప్లాంటులు, లైటింగ్ విషయాలలో తగిన శ్రద్ధను తీసుకోవాలి.

ఇంటి ముందు, రెండుప్రక్కలా పూలతోట, వెనక పెరటిలో కిచెన్ గార్డెను ఆలోచించవలసిన విషయం: వీటిని నేర్పుగా నైపుణ్యంతో పెంచుకుంటే, పూజకుపుష్పాలు, అలంకారానికి పువ్వులు. వంటకు కాయగూరలు ఎప్పటికప్పుడు తాజాగా లభిస్తాయి. దీనివల్ల ఒకవిధమైన తృప్తి ఆనందంకూడా ఉంటుంది.

"ఆలోచనలో మార్పు పెరుగుదల ఉండడం మానవ లక్షణం, అవి లేకపోవడం జంతు లక్షణం."

ఎమ్. వెంకటకృష్ణయ్య:

తాతయ్య అని పిలుస్తారు. పత్రికా స్వేచ్ఛకొరకు పోరాడిన వీరుడు. మైసూరులో ఇతడు అనేక విద్యాసంస్థలను ఏర్పాటు చేసాడు. అనాధలకు ఆనందాలయాన్ని నెలకొల్పాడు. పదికిపైగా మైసూర్ హెరాల్డ్, 'ఉదంత చింతామణి' వంటి ఇంగ్లీషు, కన్నడ వార్తాపత్రికలను కూడా స్థాపించాడు.

* * *

శంకరన్ నాయర్:

మద్రాసు అడ్వొకేట్ జనరల్‌గా నియమింపబడిన మొట్టమొదటి భారతీయుడు. 1915 లో వైస్రాయి నిర్వాహక సంఘంలో సభ్యుడుగా నియమింపబడి విద్యవిషయమైన పోర్ట్ పోలియోను చేపట్టాడు. మాంటేగ్ - చెల్మ్స్‌ఫోర్డ్ రిపోర్ట్‌పై ఇతడి అసమ్మతిని చాలామంది ఆమోదించారు.

* * *

సయిఫుద్దీన్ కిట్‌చ్లూ:

గాంధీజీకి సన్నిహితుడు. జీవితాంతం స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు. 14 సంవత్సరాలు కారాగార శిక్షను అనుభవించాడు. స్వాతంత్ర్యం అనంతరం శాంతి స్థాపనకు ఇతడు చేపట్టిన ఉద్యమాలు ప్రపంచ ప్రఖ్యాతిని పొందాయి. 1954 లో ఇతడు 'లెనిన్ పీస్' (రూ. 1,25,000) బహుమానాన్ని పొందాడు.

## అపజయానికి సూత్రం

విజయానికి సూత్రం చెప్పలేము. అపజయానికి మాత్రం చెప్పగలము—"అదే అందరినీ సంతోషపెట్టడానికి ప్రయత్నించు"

## టాల్‌స్టాయ్ ధర్మసూత్రాలు




వృద్ధాప్యం అనుభవించిన టాల్‌స్టాయ్ ఆరోగ్య ధర్మసూత్రాలు రష్యాలో పంచిపెట్టబడుతున్నాయి. అవి మిక్కిలి చైతన్యవంతమైనవి, ఇక్కడ క్రోడీకరించబడ్డాయి.

- ఎప్పుడూ మంచి శుభ్రమైన గాలి.
- ప్రతి రోజూ వ్యాయామం.
- ఆహార పానీయాలలో మితిమీరకుండా ఉండటం.
- వారానికొకసారి వేడినీళ్ళ స్నానం. ప్రతినిత్యం చన్నీటి స్నానం.
- సుఖంగా హాయిని గాలిపే తేలిక బట్టలు ధరించడం.
- పొడిగా, విశాలంగా ఉండి మంచి గాలి, వెలుతురు ప్రవేశించే ప్రదేశంలో నివాసము.
- పరిశుభ్రత.
- శారీరక, మానసిక సంక్షోభాలు కలుగకుండా ఉండే సక్రమమైన ప్రశాంత ధ్యానం.
- సత్క్రియలతో కూడిన క్రామిక ధర్మం ఆరోగ్యానికి ముఖ్యం.

"ముఖస్తుతి మారని నాణెం, అహంకారంవల్లే చలామణీ అవుతుంది."

# విటమిను "ఏ" కంటికి రక్ష

సంవత్సరానికి అరమిలియనుమందికి పైగా పిల్లలకి ఆహారంలో విటమిను 'ఎ' లోపించడంవల్ల కళ్ళు పోతున్నాయి. దీంట్లో 3కి 2 వంతులు ఏ కొద్ది వారాలలోనో మరణిస్తున్నారు. బ్రతికి బయటపడినవారు ప్రకృతిని చూచి ఆనందించలేకపోతున్నారు.



విటమిను 'ఎ' కాప్సూలు ధర రూ. 1 అని తెలిసినప్పుడు, విటమిను ఎ లోపించిన రోగులకు వారి కంటి రక్షకు సంవత్సరానికి ఇటువంటి కాప్సూల్స్ రెండేరెండు చాలని తెలిసినప్పుడు ఈ విషాదకరమైన విషయం మరింత దుర్భరమైపోతూంది. సాధారణంగా తినే ఆహారాన్ని విటమిను 'ఎ'తో పుష్టికరం చేయడానికి మనిషికి సంవత్సరానికి రూ. 3 లు ఖర్చు అవుతుంది.

ఒక్క గ్రుడ్డితనంతోనే కాదు దాదాపు 6-7 మిలియను పిల్లలు విటమిను 'ఎ' లోపంవల్ల సంభవించే అనేక ఇతర రోగాలతో బాధపడుతున్నారు. విటమిను 'ఎ' లోపం లేకుండా ప్రజల ఆహారాన్ని అభివృద్ధి పరచడం ఒక్కటే దీర్ఘ కాలిక సమాధానం అనిపిస్తుంది. ముదురు ఆకుపచ్చని ఆకు కూరల ఉపయోగం, ప్రొ విటమిను 'ఎ' (కెరోటీనులు)గల పండ్లు ఉపయోగం ప్రజలలో ఎక్కువగా ప్రోత్సహించాలి.

శరీరంలో నిల్వచేయగల పోషకాంశాలు తగ్గిపోయినప్పుడు విటమిను 'ఎ' లోపం సంభవిస్తుంది. జంతు సంబంధమైన లివరు, పాలు, వెన్న, గ్రుడ్డు, పసుపు పచ్చని మరియు ఆకుపచ్చని కూరల ఉపయోగంవల్ల దీనిని భర్తీ చేయవచ్చు. మునగ ఆకులో విటమిను 'ఎ' పుష్కలంగా లభిస్తుంది. మునగ ఆకు, మునగ పూవు, మునగ కాడ అన్నింటినీ ఉపయోగించవచ్చు.

అవసరమైనంత విటమిను 'ఎ' లభించనప్పుడు లేక విటమిను 'ఎ' శరీరంలో సక్రమంగా వినియోగింపబడనప్పుడు

## మీరైతే...?

(మార్చి 1988)

('ప్రయోగం ఫలించాలి' అంటే)

"ప్రతిభతోపాటు
పట్టుదల కావాలి అంటాను."
—మహమ్మద్ ఖలీలాద్దీన్, మస్తులాపూర్.

• • •

"ప్రయోగం ఆచరణాత్మకంగా
ఉండాలి."
—డి.జి. శంకర శ్రీనివాస్, గంగవోళ్ళ పెంట.

• • •

"కృషికోనాస్తి దుర్భిక్షమ్ అంటాను."
—ఎమ్. సూర్యప్రకాశరావు, రామరాజులంక.

"పరనింద చేయక దుర్జనుడు సంతుష్టుడు కాడు."

వెంటనే కండ్లకు అపాయం ఏర్పడి రేచీకటి, కంటిపొర (కెరాటినైజేషన్) గట్టిపడి పోవుట, కంటిపొరపై పుండ్లు ఏర్పడి కంటిపొర నశించిపోవుట మొదలైన అపాయాలు సంభవిస్తాయి. చంటిపిల్లలలో విటమిన 'ఎ' లోపం ఎంతమాత్రం ఉన్నా ప్రేగుల సంబంధమైన అజీర్ణ రోగాలు, ఊపిరితిత్తుల రోగాలు బయలుదేరి వాటివల్ల మరణం సంభవించే అవకాశాలు కలుగుతాయి.

చంటిపిల్లలకు విటమిన 'ఎ' చాలా అధికంగా కావలసి ఉంటుంది. కాబట్టి దీని లోపంవల్ల వారికి ఎక్కువగా రోగాలు సంభవిస్తాయి.

పిల్లలు చాలా చిన్నగా ఉన్నప్పుడు విటమిను లోపం తీవ్రంగా ఉంచే కంటి రోగంతో మరణం తథ్యం. సకాలంలో చికిత్స పొందని 60 మొదలు 70 శాతం చంటిపిల్లలు కండ్లుపోయిన కొద్ది వారాలకు మరణిస్తారు.

చంటిపిల్లలకు విటమిను 'ఎ'తో పాటు సరైన ప్రోటీనులు పుష్కలంగా లభించే పుష్టికర ఆహారం తగినంత లభించేటట్లు శ్రద్ధవహించాలి. చనుబాలలో విటమిన 'ఎ' పుష్కలంగా ఉంటుంది. కాబట్టి వీలైనంత వరకు చనుబాలను ఇవ్వడం మానకూడదు. చంటిపిల్లలు తినే ఆహారాన్ని మరింత పుష్టికరం చేయుట ద్వారాగానీ, పోపులు, సువాసన పదార్థాలు చేర్చిగాని ఆహారంలో విటమిను 'ఎ' లోపాన్ని తీర్చవచ్చు.

అవసరమైనప్పుడు తక్షణ చికిత్సకు, నివారణకు ఒకే మోతాదు లేక వరుసగా ఎక్కువ మోతాదులు విటమిను 'ఎ' ఇవ్వవలసి ఉంటుంది.

—'డబ్ల్యుహెచ్ఓ' సౌజన్యంతో

## ఆంగ్లమే ఎందుకు ?



300 సంవత్సరాలపాటు అలవాటైపోయిన ఇంగ్లీషు భాష విద్యావిధానంలో పరిసమంగా సర్దుకుపోయింది. విద్యారంగంలో, పాలనారంగంలో, న్యాయరంగంలో, వివిధ దేశనాయకులు కలుసుకున్నప్పుడు పరస్పరం అవగాహన చేసుకోడానికి ఆంగ్లమే సమైక్యతకు తోడ్పడుతుంది. అంతర్గ్రహ సంబంధాభివృద్ధి యుగంలో వైజ్ఞానిక శాస్త్రాభివృద్ధికి, సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధికి, ప్రగతికి ఆంగ్లం సహకరిస్తుంది. న్యాయశాస్త్రాధ్యయనంలో, ఇంజనీరింగ్, మరియు వైద్య విధానంలో ఇంగ్లీషు ఉన్నత స్థానాన్ని పొందింది. రాజాజీ చెప్పినట్లు ఇంగ్లీషు భారతదేశానికి సరస్వతీదేవి వరప్రసాదము.

—ఫ్రాంక్ ఆంథోనీ

"అజ్ఞానం—అదే బలహీన మనస్కులను భయపెట్టేది."

—లూయీస్ బ్లాంక్

# అపూర్వ విషయాలు

## వెన్నిస్‌లో కంటె బర్మింగ్‌హామ్‌లో కాలువలు 22 మైళ్ళు అధికం

ఇటలీలో ప్రసిద్ధిపొందిన వెన్నిస్‌లో నీటి ప్రవాహాలు, కాలువలు కన్న బర్మింగ్‌హామ్‌లో కాలువలు 22 మైళ్ళు అధికంగా ఉన్నాయి.

## ఏనుగు తొండంలో 40,000 కండరాలు

ఏనుగు తొండంలో 40,000 కండరాలు



ఉంటాయి. తొండంలో ఒక్క ఎముకకూడా ఉండదు.

## మికొనోస్‌లో 365 చర్చిలు

చిన్న గ్రీకు ద్వీపం మికొనోస్‌లో 365 చర్చిలు నిర్మించబడ్డాయి.

## రోస్సిని 38 నాటకాలు రచించాడు

ఇటలీ రచయిత రోస్సినీ తన మొదటి 37 సంవత్సరాల వయస్సులో 38 సంగీత నాటకాలను రచించాడు. ఆ తరువాత అతడు 39 సంవత్సరాలు జీవించినా తిరిగి ఒక్క నాటకం కూడా వ్రాయలేదు.

## యుఎస్ఎలో చాలామంది ప్రమాదాలవల్లే మరణిస్తారు

యుఎస్ఎలో 1 మరియు 14 సంవత్సరాల మధ్యవయస్సు వారిలో రోగాలకంటే ప్రమాదాల వల్లే ఎక్కువమంది మరణిస్తున్నారు.

## ఐస్ హాలు

మధ్య యూరప్‌లో స్విట్జర్లాండులో జుంగ్‌ఫ్రా (Jungfrau) కొండమీద 'మంచు చావడి' (Hall of ice) లో పియానో, స్టవ్, బల్లలు ఉన్నాయి. ఇవన్నీ మంచు గడ్డను చెక్కి తయారుచేసారు.

## 'ఫ్లీ' దాని పొడవుకు 200 రెట్లు పైగా గెంతగలదు

రక్తాన్ని పీల్చే 'ఫ్లీ' (తుళ్ళపురుగు) దాని పొడవుకు 200 రెట్లు పైగా గెంతగలదు.

### ఆరోగ్య సౌభాగ్యాలకు మార్గము

సక్రమంగా నిర్ణీత కాలం పనిచేయడం, ఉద్యోగానికి ఆలస్యం లేకుండా వెళ్ళడం, మంచి అలవాట్లను అభ్యాసం చేసుకోడం, కాలం విలువ తెలిసి ఉండటంవల్ల వ్యక్తి యొక్క ఆరోగ్య సౌభాగ్యాలు అభివృద్ధి పొందుతాయి.

—ఎమ్. విశ్వేశ్వరయ్య

"దుఃఖాన్ని వీలైనంతవరకూ తగ్గించి జీవితాన్ని వీలైనంతసుఖమయం చేసుకోడమే మన కర్తవ్యం."

# సమృద్ధిగా "ఎ" విటమిను లభించే టొమాటో పండు

కెవిజె జి. ఎస్. వర్మ

టొమాటో మిక్కిలి అద్భుతమైన పండు.

దీనిని వండకుండా పచ్చిదిగా తినడం చాలా శ్రేష్ఠం. టొమాటో పండు శరీరంలో రక్తాన్ని శుద్ధిచేసి నరాలకు ఉత్తేజాన్ని కలిగించే బలవర్ధక ఔషధంగా ఉపయోగపడుతుంది. మలబద్ధతను నిర్మూలిస్తుంది. నోటిలో దంతాలను చిగుళ్ళను గట్టిపరచి




ఆరోగ్యంగా ఉంచుతుంది. అతి తేలికగా జీర్ణమవుతుంది కాబట్టి జ్వరంతో బాధపడే బలహీనులకు, మధుమేహం (Diabetes)తో బాధపడే శక్తిహీనులకు, దీర్ఘకాలంపాటు ఉపవాసం ఉన్నవారికి ముఖ్యమైన ఆహారంగా దీన్ని వాడతారు. మధుమేహ రోగులకు ఈ పండు మూత్రంలో చక్కెర పాలును అమోఘంగా నియంత్రిస్తుంది.

విటమిను 'ఎ' సమృద్ధిగా లభించడం వల్ల రేచీకటి (Night blindness) మరియు హ్రస్వదృష్టి నివారణలకు కంటి వైద్యులు దీనిని వాడమంటారు. దీంట్లో విటమిను 'సి'

## సెంట్ ఫ్రాన్సిస్

సెంట్ ఫ్రాన్సిస్ అనే మహాత్ముడు ఇటలీలో అస్సిసి (Assisi) అనే చిన్న గ్రామంలో నివసిస్తూండేవాడు. దరిద్రులతో పాటు జీవిస్తూ దరిద్రులకు సేవ చేయుటే జీవితంలో ముఖ్య ధర్మం అనుకున్నాడు. 1215 లో వాటికన్ (రోము) నగరంలో పోపును ఫ్రయిర్స్ (ఫకీర్లు)కు నిబంధనలను ఏర్పరచమన్నాడు. ఫ్రయిర్స్‌కు ఆస్తిపాస్తులు ఉండకూడదని, వారు బూడిదరంగు గౌనులు చినిగిపోయేదాకా కొత్తవి కుట్టించుకోకూడదని శాసించాడు. ఆనాడు దరిద్రులలాగే వీరు కూడా జోళ్ళు లేకుండా వట్టి కాళ్ళతో నడవాలన్నాడు.

ఫ్రయిర్స్ దరిద్రుల సేవలు చేస్తూ, మార్కెట్ ప్రదేశాలలో వారికి ఉపన్యాసాలు ఇస్తూ, హాస్పిటల్లో వారికి కావలసిన సౌకర్యం కలిగిస్తూ ఆహారం బిచ్చమెత్తుకుని జీవించాలి. వేలకొద్దీ ప్రజలు ఫ్రాన్సిస్‌ను నాయకునిగా సమ్మతించారు. యూరప్ దేశమంతటా బూడిదరంగు గౌనులు ధరించిన ఫ్రయిర్స్ సర్వసాధారణమైపోయారు. పక్షులు, మృగాలు కూడా ఫ్రాన్సిస్‌ని ప్రేమించాయి. వీటిని అతడు చిన్న చెల్లాయిలు, తమ్ములు అనేవాడు.

"లేనివాడు కాదు, అధికంగా ఆశించేవాడే కటిక దరిద్రుడు."

కూడా పుష్కలంగా లభిస్తుంది కాబట్టి 'స్కర్వీ' నివారణకు కూడా దీనిని వాడతారు.

20 గ్రాముల టొమాటో పండ్లరసం రోజుకు నాలుగుసార్లు ఇస్తే నోటి చిగుళ్ళ వెంబడి రక్తంకారుట నిలిచిపోతుంది. శరీరం మీద బయలుదేరే దురదలకు, తామరలకు ఇది దివ్య ఔషధంగా ఉపయోగపడుతుంది. వివిధ విటమినులు, సున్నము, ఇనుము వంటి ఖనిజ పదార్థాలు పుష్కలంగా లభిస్తాయి కాబట్టి ఇది పసిబిడ్డల పెరుగుదలకు మంచి ప్రయోజనకారి. ఒక ఏడాది వయస్సు వంటి పిల్లలకు రోజుకు మూడుసార్లు ఒక చిన్న చెంచాడు తాజాటొమాటో పళ్ళరసం అనువైన మోతాదు.

టొమాటో మితిమీరి ఉపయోగిస్తే జీర్ణ ప్రక్రియ చెడిపోయే అవకాశముంది. బాగా పండిన టొమాటో వండకుండా పచ్చిగా తినడం ఎంతో శ్రేయస్కరం. సక్రమంగా ప్రతిదినం దీనిని ఉపయోగిస్తే ఆరోగ్యాభివృద్ధి కలుగుతుంది. ఉత్తేజకరంగా ఉంటుంది. సన్నగా తరిగిన టొమాటో ముక్కలు, సన్నగా తరిగిన ఉల్లి, ముల్లంగి కోరు, కొత్తిమిరితో రుచికరమైన 'సాలడ్' తయారు చేసుకోవచ్చు. టొమాటో ముక్కలను కొద్దిగా నేతితో వేయించి తగినంత నీటితో ఉడకబెట్టి సన్నని బట్టతో వడకట్టిన టొమాటో రసానికి అవసరమైనంత బెల్లం, సువాసనకి ఏలకుల పొడి కలిపి మంచి పానీయం తయారు చేసుకోవచ్చు. రోజుకి 200 మొదలు 300 గ్రాములు టొమాటో ఇబ్బంది లేకుండా ఉపయోగించవచ్చు. అంతకు మించి అధికంగా తీసుకుంటే హానికరము.

## గబ్బిలాలు ప్రతిధ్వనినిబట్టి దారిని తెలుసుకుంటాయి



గబ్బిలాలు క్షీరదాలు. మొదట కొన్ని వారాలపాటు అవి పాలఆహారంమీదే జీవిస్తాయి. వాటి ముఖం ఒక చిన్న కుక్క మూతిలా ఉంటుంది. వాటి దంతాలు కూడా కుక్క దంతాలులాగే ఉంటాయి. ఇవి వాటి కండ్లతోగాక ప్రతిధ్వనితో దారి తెలుసుకుంటాయి ఇది మన చెవులకు వినిపించని శబ్దతరంగాలను జనింపజేస్తాయి. ఈ శబ్ద తరంగాలను ఎలక్ట్రానిక్ పరికరాలతో మాత్రమే తెలుసుకోగలం. ఈ శబ్ద కంపనలు రాడారువలె చుట్టుపట్ల గోడలు లేక తీగల నుండి ప్రతిధ్వనిస్తాయి. ఇవి మిక్కిలి సున్నితంగా సూక్ష్మంగా ఉంటాయి. కళ్ళకు గంతలు కట్టిన గబ్బిలం ఒక అడుగు ఎడంలో ఉన్న రెండు తీగల మధ్య వాటికి తగలకుండా అతిసామర్థ్యంగా ఎగురుతుంది. గుహలలో నివసించే గబ్బిలాలు (Cave bats) అరటిపండ్ల అత్తాలులాగా అదా రాన్ని పట్టుకు వ్రేలాడుతూ శీతాకాలం అంతా నిద్రపోతాయి. చెట్లమీద గబ్బిలాలు (Tree bats) స్వాలో (Swallow) పక్షులలాగా ఉష్ణప్రదేశాలకు వలసలు పోతాయి.

"నేల విడిచి సాము తగదు, నీరు విడిచి ఈత తగదు."

# వాల్మీకి లేకపోతే?

సీతా రవిచంద్రన్

వేదాల తరువాత లౌకిక వాఙ్మయంలో రామాయణం, మహాభారతం, భాగవతం ముఖ్యమైన గ్రంథాలుగా ఆవిర్భవించాయి. రామాయణంలో శ్రీరాముడు మహాభారతంలో ధర్మరాజు, భాగవతంలో శ్రీ కృష్ణుడు అందరూ మనకు పూజనీయులే. ముగ్గురూ ఆదర్శపురుషులే.



రతి పారవశ్యంలో తన్మయత్వం పొంది ఆనందిస్తూన్న క్రౌంచపక్షుల జంటలో ఒకదానిని నిషాదుడు చంపినప్పుడు ఆడుపక్షి విలాపాన్ని చూచి విహ్వలుడైన వాల్మీకి శోకం శ్లోకమైంది. వాల్మీకి సంస్కృత సాహిత్యానికి ఆదికవి. ఆయన రచించిన కావ్యం రామాయణం, ఆదికావ్యం. అనుగ్రహ గ్రంథమని చెప్పబడే రామాయణం పవిత్రమైనది, ఆరాధనీయమైనది. ఇటువంటి రామాయణంలో ప్రతీ అక్షరం ఘోరమైన పాపాలను నశింపజేస్తుంది. రామాయణాన్ని గానీ, రామాయణంలో ఒక్కపాదాన్ని గానీ, పాదంలో ఒక పదాన్ని గానీ వించేవారు పుణ్యం లభిస్తుందని మన ప్రాచీనులు రామాయణాన్ని కీర్తించారు.

రామాయణంలో శ్రీరాముడు సాధువు. సత్యపరాక్రముడు, రూపుగొన్న ధర్మము, ఏకపత్నీవ్రతుడు. అతడే సర్వప్రజలకు పూజనీయుడు. శ్రీరాముడు ఆదర్శప్రాయుడైన పుత్రుడు. సోదరుడు, ప్రభువు, అనురక్తుడైన పతి. మానవతను ప్రేమించే ధర్మశీలుడు. ఏ దేశంలోనైనా భార్యలు దొరుకుతారు, బంధువులు లభిస్తారు. కానీ ఏకోదరునివలె ఉండే తమ్ముడు కనిపించే దేశం మాత్రం కనబడటంలేదని లక్ష్మణుని గురించి చెప్పిన భ్రాతృ వాత్సల్యమూర్తి శ్రీరాముడు. సీత ఆదిలక్ష్మి అవతారం. సీతమ్మతల్లి ఆదర్శమహిళ. ఆమె ఆదర్శపత్ని. ఆమె బ్రతుకు కన్నీటి కాలువ. ఆమె అనుభవించిన కష్టాలను, పాతివ్రత్య నిష్ఠను తలచుకుని జలదరించని భారత స్త్రీ ఉండదు. సీతారాములు ఆదర్శదంపతులు.

హనుమంతుడు నమ్మినబంటు. ఉదాత్తుడైన దూత. రామునికి, సుగ్రీవునికి మైత్రి నెరపాడు. సముద్రం దాటి సీతను చూచి మాటలాడి వచ్చాడు. లోకజ్ఞత, వ్యవహార కుశలత, సంభాషణ చాతుర్యం కలవాడు. రామాయణ మహామాలారత్నము. ఇట్టి మహోన్నత పాత్ర పోషణతో వాల్మీకిరామాయణం, నవరసభరితమైన సర్వాలంకార శోభితమగు మహాకావ్యం. పండిత, పామరులందరకు రామాయణం ప్రాణప్రదం. భారత జాతిపై దీని ప్రభావం అత్యంత గాఢమైనది. సంగీతంలో, సాహిత్యంలో, చిత్రలేఖనంలో

"ధర్మం డబ్బుతోనే గాదు, మంచి మనసుతో,
మంచిమాటతో, మంచి చేతతో కూడా చేయవచ్చు."

శిల్పకళలలోనే గాక నాణెముల మీద కూడా రామాయణం చోటు చేసుకుంది. తెలుగు దేశంలో రామాయణ వాఙ్మయప్రభావం భక్తి రూపంలో అపారమై మహాసముద్రంలా ప్రవహిస్తూంది. తెలుగునాట రామాలయాలు, రామభక్త సమాజాలు, భజన మందిరాలు లేని ప్రదేశం ఉందా అనిపిస్తుంది. "సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాతండ్రి" నిజమే శ్రీరాముడు తెలుగువారి కన్నతండ్రి. సీతమ్మ కన్నతల్లి. వారికి 'అంతా రామమయం ఈజగమంతా రామమయమే." ఇతర దైవముల కన్న సీతారామచంద్రులకు తెలుగువారి హృదయాలు హత్తుకుపోయాయి. దీని ఫలితంగా తెలుగు రామాయణ గ్రంథాల సంఖ్య అపారంగా పెరిగిపోయింది. కవిత్వం నేర్చిన ప్రతి కవీ ఏదోవిధంగా రామాయణం వ్రాయకుండా వదలలేదు.

తెలుగు వాఙ్మయంలో రామాయణ కథ రచనకు భారత భాగవతాలకు ఉన్నట్టు మత ప్రసక్తి లేదు నన్నయనాటి నుండి నేటిదాకా అవిచ్ఛిన్నంగా రామాయణ రచనలు కొనసాగుతూనే ఉన్నాయి. సంస్కృత రామాయణానికి యథాతథమైన అనువాదాలు వచ్చాయి. వాల్మీకి చెప్పిన సంస్కృత కథనం మాతృకగా స్వతంత్రరచనలు వచ్చాయి. అనేక కావ్యాలు, ప్రబంధాలు, అచ్చతెనుగు కావ్యాలు, గేయాలు, పాటలు, హరికథలు, నాటకాలు, శ్లేషకావ్యాలు, వచనకావ్యాలు, యక్షగానాలు, ద్విపదలు, నిరోష్ఠ్యాలు, నిర్వచనాలు ఒక్కటా: తెలుగులో సాహిత్య ప్రక్రియలు ఎన్ని ఉన్నాయో అన్నిటిలోను రామకథ వ్యాపించి విస్తరించుకుపోయింది. రామకథ లేని సాహిత్య ప్రక్రియ లేదు: సాహిత్యం సాధించగల సత్ఫలితాలన్నిటినీ సాధించింది.

కావ్యాలుగా భాస్కర రామాయణం, ఎర్రాప్రెగ్గడ రామాయణం, గోపీనాథ రామాయణం, యథావాల్మీకి రామాయణం, రామాభ్యుదయం, మొల్లరామాయణం, రఘునాథ నాయకుని రామాయణం, పట్టాభిరామ విలాసం, రామచంద్రోపాఖ్యానము, రంగనాథ రామాయణం మొదలైనవి వెలసాయి. ద్విపద కావ్యాలుగా కట్టా వరదరాజు రామాయణం, తాళ్ళపాక అన్నమాచార్యులవారి రామాయణం, తరిగొండ వెంకమాంబ రామాయణం వచ్చాయి.

రాఘవ పాండవీయము, రామకృష్ణోపాఖ్యానం, రాఘవ వాసుదేవీయం అనే ద్వ్యర్థి కావ్యాలు, చంపూ రామాయణాలు, విచిత్ర రామాయణం, శతకంఠ రామాయణాలు, అద్భుత రామాయణాలు, ఆధ్యాత్మిక రామాయణాలు, వాసిష్ఠ రామాయణాలు, ఉత్తర రామాయణాలు బయలుదేరాయి. యక్షగానంలో లేపాక్షి రామాయణం, బొమ్మలాట రామాయణం, సుగ్రీవ విజయం, లవకుశల చరిత్ర మొదలైనవి కోకొల్లలుగా ఉద్భవించాయి.

ఇటీవలి వావిలి కొలను సుబ్బారావుగారి ఆంధ్ర వాల్మీకి రామాయణం, జనమంచి శేషాద్రిశర్మగారి ధర్మసార రామాయణం, విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్పవృక్షం ప్రసిద్ధి పొందాయి.

రామాయణ సంబంధమైన జానపద వాఙ్మయంలో శారదా రామాయణం, లవ

"కష్టాలను చూచి పారిపోకు. నిలబడి జీవితాన్ని సుఖవంతం చేసుకో."

తుళల చరిత్ర, లంకాయాగము, అడవి గోవింద నామాలు, పుత్రకామేష్ఠి, లక్ష్మణ మూర్ఛ. శ్రీరామపట్టాభిషేకం, ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణ దేవరనవ్వు, సీతాదేవి యాన వాలు, మాయలేడి పాట, సీత సింగారం, సీతసురటి, కౌసల్య వేవిళ్ళు. సీతాదేవి వేవిళ్ళు, సీతాదేవి వామన గుంటలు మొద లైనవాటికి అంతులేదు. ఇది ఒక అపూర్వ రామకథా సాగరం.

వాల్మీకి లేకపోతే మనకు రామాయణం ఎక్కడిది? ఆంధ్రుల కన్నతల్లి సీతమ్మ ఎక్కడ? కన్నతండ్రి రామచంద్రుడు ఎక్కడ? దేశంలో రామతీర్థాలు, రామాల యాలు ఉద్భవించేవా? 'సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మా తండ్రి' అంటూ పరవశం చెందిన త్యాగరాజుకి బాలకనకమయ చేల, సుజన పరిపాల, విధృత శరజాల, ఘనాఘన నీల, నవ్యమాలికాభరణ. రాజీవనేత్ర, జలధి గంభీర, మదన సుకుమార, అతిలావణ్య, దివ్యరాజకోటి సమతేజ, జలజముఖ మొద లైన విశేషలక్షణాలతో కూడిన దివ్యమంగళా కృతి స్ఫురించి ఉండేదా? రామాయణ కథాత్మకంగా భక్తిరసపూరితమైన 600 త్యాగరాజ కృతులు మనకు లభించి ఉండేవా? "నన్నుబ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ" అని వాపోతూ "అంతా రామమయం ఈజగ మంతా రామమయం" అని తెలియజెప్పే భద్రాచల రామదాసుగా వెలసిన కంచెర్ల గోపన్న 'అదుగో భద్రాద్రి గౌతమి, ఇదిగో చూడండి" అని హెచ్చరించి ఉండేవాడా? "పలికెడిది భాగవతమట పలికించు విభుడు రామచంద్రుడటనే" - అంటూ రామసాక్షాత్కారం పొందిన ముముక్షువు, మహాయోగి, సహజ పాండిత్యుడు అగు పోతన మహాకవి భాగవతం తెలుగునాట ఇంటింటా నెలకొని ఉండేదా? వాల్మీకే లేకపోతే తెలుగు వాఙ్మ యంలో వటవృక్షంలా పెరిగిపోతూన్న రామాయణ కథా రచనలు ఇన్ని పుట్టేవా? సీతారాములతో తాదాత్మ్యం చెందే జానపదు లకు భక్తియోగం సులభంగా లభించి ఉండేదా? రామకథకు సంబంధించిన జాన పద వాఙ్మయం ప్రవృద్ధిచెంది ఉండేదా?

## గంటకు 400 కి.మీ.ల వేగాన్ని అధిగమించిన మొదటి హెలికాప్టర్



అగస్టు 1986 లో వెస్టలాండ్ లింక్స్ గంటకు 400 కి. మీ. ల వేగాన్ని అధిగ మించి ప్రపంచంలో మిక్కిలి వేగవంతమైన మొదటి హెలికాప్టరు అనిపించుకుంది. దీనికి విప్లవాత్మకమైన సరికొత్త బెర్ప్టిప్ (Berptip) రోటార్ అమర్చబడింది. దీని వల్ల హెలికాప్టర్ సామర్థ్యం 40 శాతం అధికమవుతుందని అంటారు.

"ఏదీ స్థిరంకాదు - కీర్తి అయినా, ప్రఖ్యాతి అయినా."
—మార్కస్ అరెలియస్

## బహుమతి పొందిన వ్యాసం

# నిత్యజీవితంలో హాస్యం

కుమారి సి. అపర్ణ, తెనాలి.

మనిషికి ఏడవడానికి కావలసిన ముఖకండరాలకన్నా నవ్వడానికి చాలా తక్కువ కండరాలు అవసరమవుతాయి. నవ్వేటప్పుడు ప్రతికండరం ఒత్తిడిని తొలగించుకుని ఒక విధమైన ప్రశాంతతను పొందుతుంది. సాధారణంగా సంతోషంగా నవ్వేవారితోనే మాట్లాడాలనే బుద్ధి అందరి అనుభవము. ఏడ్చేవారిని పలకరించ బుద్ధికాదు. బాధపడేవాడు బాధను ఇతరులతో పంచుకోడానికి చూస్తాడు. నీ నవ్వును నలుగురితో పంచుకో కానీ 'నీ బాధను నీలోనే ఉంచుకో' అని అంటారు. నవ్వు, సంతోషం, ఆహ్లాదం మానవునిలో సామరస్యాన్నీ, సుహృద్భావాన్ని పెంపొందిస్తాయి. వీటిని సాధించడానికి ఉన్న వివిధ మార్గాలలో హాస్యం ఒకటి. హాస్యం అపహాస్యం కానంతవరకూ నవ్వునూ, ఆనందాన్నీ కలిగిస్తుంది. జీవిత వ్యవస్థలో మనకి కుటుంబంలోనూ, సమాజంలోనూ కూడా అనేక సమస్యలు ఉత్పన్నమవుతాయి. వీటివల్ల కలిగే ఒత్తిడులను తట్టుకోడానికి హాస్యం ఒక్కటే ఆధారం. 'సంతోషం సగం బలం!'

హాస్యోత్పత్తికి చమత్కారం, సమయస్ఫూర్తి, విరుపు, త్రిప్పికొట్టడం, వక్రానుకరణం మూలాలు. వీటిలో మొదటి రెండూ కుటుంబపరంగా సుఖసంతోషాలను పెంచుకోడానికి ఉపకరిస్తాయి. మిగిలినవి సాంఘికపరంగా ఉపయోగపడతాయి. హాస్యసాధనలో నేర్పు అవసరం. హాస్యం అపహాస్యం అయితే అపాయం.

నవరసాలలో మిగిలిన వాటికన్నా హృద్యంగా ఉండి వెంటనే ఆకట్టుకోగల రసం హాస్యం. హాస్యరసానికి అవధులు

### సిగరెట్లుచేసే అపకారం



రోజుకు 20 సిగరెట్లు దాకా కాల్చేవారు, అసలు కాల్చనివారి కంటే గుండెపోటుతో మరణించడానికి అవకాశాలు రెట్టింపు ఉంటాయి. రోజుకు 40 సిగరెట్లు దాకా కాల్చేవారు, ముఖ్యంగా చాలాకాలం నుంచీ ఈ అలవాటు ఉండి 50 సంవత్సరాల వయస్సు పైబడిన వారికి కాల్చని వారికంటే గుండెపోటు రావడానికి అవకాశాలు 10 రెట్లు అధికంగా ఉంటాయి.

—'యోజన' సౌజన్యంతో

"అనుష్ఠానం లేని విద్య దీపం వెలిగించుకుని కళ్ళుమూసుకోడం వంటిది."

లేవు. జాతి, మత, కుల భేదాలు లేవు. విశ్వనాథను పొగడగలిగినా, భమిడిపాటి, మునిమాణిక్యం, బాపు, రమణలను గుర్తుంచుకుంటాం.

సార్వజనీనకము, సామరస్య సాధనము, సంతోషదాయకము అయిన హాస్యం నిత్య జీవితంలో ఎంతైనా అవసరం. అది అపహాస్యం కాకుండా చూసుకోడం వివేకం.

* * *

వారణాసి పాపయ్యశాస్త్రి,

విజయనగరం.

జననమరణాల మధ్యకాలం జీవితం. శోకం కరుణరసమైతే నవ్వడం హాస్యరసమౌతుంది పళ్ళు కనీకనపడని చిరునవ్వు నుండి విరగబడి నవ్వేశం వరకూ నవ్వులు అనేక రకాలు. నవ్వేతీరునుబట్టి వ్యక్తిత్వాన్ని అంచనా కట్టవచ్చు, జ్ఞానులు రాగద్వేషాతీతులు, సమదర్శనులు, పొంగిపోరు, క్రుంగిపోరు. వీరు ఎప్పుడూ మందస్మిత ముఖారవిందులు. కృష్ణపరమాత్మ నవ్వుతూన్న వానివలె (ప్రహసన్నివ) అర్జునునికి గీతారంభం చేసాడు. రాముడు, బుద్ధుడు, నానక్ మొదలైన జ్ఞానులదీ చిరునవ్వే.

సత్త్వగుణులు, నిర్మలులు, జ్ఞానాసక్తులు వారి సర్వేంద్రియాలు జ్ఞానప్రకాశములు. వారి నవ్వులో అమాయకత్వం, నిర్మలత్వం నిండి ఉంటుంది. పసిపిల్లల బోసినవ్వులివి. గాంధీ, రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి మొదలైనవారి నవ్వులు నవరత్నాలు కురిపిస్తాయి. రజోగుణాలు, వాంఛలతో కర్మాసక్తి కలవారు. పేరాశ అశాంతి, కాంక్ష వారి స్వభావం. వీరి నవ్వులు కవిపించడమే కాదు వినిపిస్తాయి కూడా. ముసిముసి నవ్వులు, వెటకారపు పరిహాసాలు ఇలా ఎన్నో!

మయసభలో ద్రౌపది పరిహాసం కురుపాండవ సంగ్రామానికి బీజం. వినాయకుని పరిహసించి చంద్రుడు శాపగ్రస్తుడై అపనిందల పాలయ్యాడు. శకుని నవ్వులో ఎంత కల్మషం, లక్ష్మణ దేవర నవ్వులో ఎన్ని అపోహలు!

తమోగుణులు, అజ్ఞానులు, అవివేకులు, మూఢులు - వీరి నవ్వు రాక్షసం. విష

## పాలిటెక్నిక్ పరీక్షలో తప్పిన ఐన్‌స్టైన్




“సాపేక్ష సిద్ధాంతా”న్ని నిర్వచించిన సుప్రసిద్ధ అమెరికన్ భౌతిక శాస్త్రవేత్త మరియు 1921 లో ఫిజిక్స్‌కు నోబెల్ బహుమానాన్ని పొందిన ఆల్బర్ట్ ఐన్‌స్టైన్ 16 వ సంవత్సరం వయస్సులో జ్యూరిచ్ ఫెడరల్ పాలిటెక్నిక్ ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణుడు కాలేకపోయాడు!

“విజ్ఞానం ఏ కొందరో ఎక్కగల పర్వతశిఖరం, కానీ ధర్మం అందరూ ఆచరించగల మార్గం.”

పూరితం. అసత్యసూచకం. మదమాత్సర్య ద్వేషము సూచించే నవ్వులు. శిశుపాలుడు, రావణుడు, హిరణ్యకశిపుడు మొదలగువారి అట్టహాసపు నవ్వు ఇది.

పిచ్చివారి, బుద్ధిహీనుల నవ్వు వెనుక భావప్రకటన ఉండదు. వారి చాంచల్య చిత్తవృత్తే ఉంటుంది. వారి నవ్వు మనకు జాలిని కలిగిస్తుంది.

నవ్వి నవ్వించడం ఒక కళ. నవ్వడం మానవుని ప్రత్యేకత. నవ్వనివాడు ప్రమాదకారి. నవ్వితే మిమ్మల్ని చూచి మరొకరు నవ్వుతారు.

* * *

సి. మోహన్ రావు, శ్రీకాళహస్తి.

నవ్వు భగవంతుని వరప్రసాదం. ఆ వరాన్ని వాడుకోడం తెలిసినవారి జీవితం అంతా మధురం. సుఖదుఃఖాల కలయికే మానవ జీవితం. పూర్తిగా సుఖంగాని, దుఃఖంగాని ఎవ్వరూ పొందరు. ఏదో విధమైన దుఃఖము పొందని వ్యక్తి లోకంలో ఎవ్వరూ కనిపించరు. జీవితం ఎంత సమస్యల చక్రమైనా హాస్యం వాటిని దూరంగా ఉంచే ఔషధం. అందుకే 'సంతోషాన్ని అందరికి పంచు. దుఃఖాన్ని నీలోనే ఉంచుకో' అని ఆర్యులు పలికారు.

హాస్యంవల్ల మనుష్యులు ప్రశాంతత పొందుతారు. ఒక సమస్యను హాస్య వాతావరణంలో పరిష్కరింప ప్రయత్నిస్తే ఎవరి మనసుకు నొప్పి కలుగదు. జీవితం నవరసాల మిశ్రమం అయినా హాస్యరసానికి ఉన్న స్థానం ప్రత్యేకం. హాస్యభాషణ ఒక సున్నితమైన కళ. తాను నవ్వుతూ పదిమందిని నవ్వించ గలిగే జీవి అదృష్టవంతుడు.

హాస్యం నరాల ఒత్తిడిని తగ్గించి మానసికోల్లాసం కలిగిస్తుంది. హాయిగా నవ్వ గలిగే వ్యక్తి జీవితం ఎంత సంపద ఉన్నా దుఃఖవంతుని జీవితంకంటే ఎన్నో రెట్లు మేలు.

జీవితంలో కేవలం బావామరదళ్ళు మాత్రమే హాస్యాన్ని వినియోగించుకోగలరనే భావనగాక హాస్యం "నిజ జీవితంలో ఒక భాగం కావాలి. జీవితంలో హాస్యం కనబరచే వ్యక్తికి లోకమంతా స్నేహమయమే. అప్పుడే వసుధైక కుటుంబం సర్వమానవ సన్నిహిత జీవనం సాధ్యం."

## అనేక నక్షత్రాలతో సరిపోలిస్తే సూర్యుడు ఎంతో చిన్న




అనేక నక్షత్రాలతో సరిపోల్చి చూస్తే సూర్యబింబం పరిమాణం చాలా చిన్నది. బెటల్‌గ్యూస్ (Betelgeuse) అనే ఎర్రటి సూపర్ స్టార్ నక్షత్రము సూర్యుని వ్యాసానికి 450 రెట్లు ఉంటుంది.

"అతి జాగ్రత్తవల్ల సాధించగల్గేది అత్యల్పమే."

# గొంతులో పుండుకి తేనె దివ్యౌషధం

మహావీర్ గుప్త

అనేక రకాలైన పేటెంట్ మందులు లభిస్తున్న ఈ రోజులలో కూడా గొంతు పుండుకి తేనె దివ్య ఔషధంగా వాడబడు తూంది. అధిక దూరం పరుగెత్తేవారికి, ఈత ఈదేవారికి, ఆర్కిటిక్ పలయాలకు వెళ్ళేవారికి తేనె అమూల్యమైన వస్తువు. ఇతర జఠర రసాల సహాయం లేకుండానే తేనె అతిసులభంగా శరీరతత్వానికి అందు తుంది. పాలుకూడా జీర్ణించుకోలేని వారికి తేనె పుష్టిని ఇస్తుంది. పంచదారలాగ ఇది జఠర కోశంలో వాయువులను జనింప చేయదు. శరీరంలో పుళ్ళు తేనెతో అతి శీఘ్రంగా మానుతాయి.

అమూల్యమైన ఖనిజ ద్రవ్యాలు, ఇను ముకు సంబంధించిన లవణాలు, భాస్వరము, సున్నము, గంధకము మొదలైనవి తేనెలో లభిస్తాయి. కృత్రిమ పదార్థాలు శరీరతత్వానికి పడకపోవచ్చు. కానీ తేనెలోగల ఈ పదా ర్థాలు సులభంగా జీర్ణం అవుతాయి. సాధార ణంగా తీసుకోలేని అనేక ఔషధాలకు అను పానంగా దీనిని వాడతారు. శుభ్రమైన తేనె రుచికరము, పుష్టికరము. కొద్దిగా విరేచన కారి. అందుకే చాలామంది పొద్దున్నే దీనిని తీసుకుంటారు.

## ఏ నెలలోనైనా చివరి రోజు

ఏ నెలలోనైనా చివరి రోజు, తరువాత వచ్చే నెలలో 7వ తేదీ ఏ రోజైతే ఆ రోజు అవుతుంది.

## వనితాలోకం



పండ్లపొడి: అతి చౌకగా అమోఘమైన పండ్లపొడి ఇంట్లోనే తయారుచేసుకోవచ్చు. 1 పాలు మెత్తటి ఉప్పు (టేబిల్ సాల్టు)కి 2 పాళ్ళ బేకింగ్ సోడా కలిపి తయారు చేసుకోవచ్చు.

4 భాగాలు సుద్దపొడి, 1 భాగం మెత్తగా పొడిచేసిన పంచదార, 1 భాగం బేకింగ్ సోడా కలిపి రెండుమూడు చుక్కలు పిప్పర మెంటు నూనె కలిపి మరో రకం పండ్లపొడి తయారుచేయవచ్చు.

షాంపూ: మంచి షాంపూకు ముఖ్యంగా కావలసినవి సోపు జెల్లీ. పియర్స్ సోపు సన్నగా కోరి దీనిని తయారుచేయవచ్చు. ఈ సబ్బుకోరు జాడీలో వేసి మునిగేదాకా మరుగుతూన్న నీళ్ళు దానిలో పోయాలి.

ఎగ్ షాంపూ: వేడినీళ్ళు కలపడానికి ముందు సోపు జెల్లీకి గుడ్డు కలిపి గిలక రించండి. —రుక్మిణీ లాల్‌చంద్

"ఇష్టములేని పనిచేయుట, జంకుచుచేయుట కార్య భంగ హేతువులు."

# పర్వతారోహణం విలాసవంతమైన క్రీడ

పర్వతారోహణం ఒక విలాసవంతమైన క్రీడగా 1854 లో ఏర్పడింది. అంతకు ముందు శతాబ్దాలలో కూడా అనేక మంది కొండశిఖరాలను ఎక్కిన దృష్టాంతాలు ఉన్నాయి ప్రాచీన కంచుయుగం (Bronze Age)లో స్విట్జర్లాండ్ రిపెల్‌హారన్ శిఖరం (9,605 అడుగుల) మీద జనం నివసించారు.

మొట్టమొదటి ఎడ్మండ్ పెర్సీవల్ హిల్లారే మరియు టెన్‌జింగ్ ఖుమ్‌జింగ్



భూటియం అనబడే షెర్పా టెన్‌జింగ్‌నోర్గే మే 29, 1953 న 11 గంటల 30 నిమిషాలకు నేపాల్ హిమాలయ పర్వతాలలో అత్యున్నతమైన ఎవరెస్ట్ పర్వత శిఖరం (29.028 అడుగులు) అధిరోహించారు. కాప్టెన్ ఎ ఎస్. చీమా, షెర్పానవాంగ్ గొంబు, సోనామ్ గయాట్సో (సిక్కిం), సోనామ్ వంగ్‌యాల్ ఇంకా కొంతమంది మే 1965 లో ఎవరెస్ట్ శిఖరాన్ని ఎక్కారు.

బొనట్టి స్తంభాన్ని 126 గంటలు 7 నిమిషాలలో ఎక్కిన ఇటలీకి చెందిన వాల్టర్ బొనాట్టీ అగస్టు 17-22 1955 లో మధ్య



యూరప్‌లో ఆల్ప్స్ శిఖరాన్ని ఒంటరిగా ఎక్కగలిగిన నిపుణుడు.

## గాంధీజీ అమరవాణి

శతకోటి సదుపదేశాల కంటే ఒక్క సత్క్రియను ప్రత్యక్షంగా అనుష్ఠించి చూపటం ఎంతో మేలు.

ఉద్వేగంతో పరుగెత్తడం కాదు, మనో వైకల్యం లేని శాంతివల్ల వివేకం ఉదయిస్తుంది. చరిత్ర చదవడంకాదు, చరిత్ర సృష్టించడం ప్రగతి.

అనుగుణంగా అలవాటుపడడం ధైర్యోత్సాహాలతో కూడిన మనుగడ. అనుకరణ అనిపించుకోదు.

సత్యమే సుస్థిరంగా నిలిచి ఉండేది — మిగిలినవన్నీ కాలవాహినిలో కొట్టుకుపోతాయి.

"సత్యమే భగవత్ స్వరూపం."

# పోటీలు

మే 1989

'విజ్‌డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీకాఎంట్రీ విడిగా పావుఠావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతీ ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితంమీద ఒకటి కంటే ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించ బడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 15 లు, రూ. 10 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతు లుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీ లకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకే సారి ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: మే 20, 1989. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు 'విజ్‌డమ్' 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

— సంపాదకుడు

## వ్యాసం

"హేతువాదం" అనే అంశం మీద 200 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. సెంట్రల్ లెదర్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ (కేంద్ర చర్మ పరిశోధక సంస్థ) ఇక్కడ ఉంది:

(ఎ) హైదరాబాదు, (బి) కాన్పూరు, (సి) ఆగ్రా, (డి) మద్రాసు.

2. మహారాష్ట్రలో నాశిక్ ఈ నదిపై ఉంది:

(ఎ) తపతి, (బి) గోదావరి, (సి) కృష్ణా, (డి) సువర్ణరేఖ.

3. క్రింది వాటిలో ఏ రైలుమార్గం పూర్తిగా విద్యుదీకరణ చేయబడింది?

(ఎ) హౌరా-మద్రాసు, (బి) మద్రాసు-బొంబాయి, (సి) ఢిల్లీ-హౌరా, (డి) ఢిల్లీ-మద్రాసు.

4. క్రిందివాటిలో ఏది భారత దేశపు ముఖ్యమైన ఆహారపు పంట?

(ఎ) గోధుమ, (బి) వరి, (సి) జొన్నలు, (డి) పప్పుధాన్యాలు

5. 'కూచిపూడి' నృత్యం ఎక్కడ ఆవిర్భవించింది?

(ఎ) ఒరిస్సా, (బి) ఆంధ్రప్రదేశ్, (సి) తమిళనాడు, (డి) కర్ణాటక.

6. రైలు ప్రయాణీకులకు రిజర్వేషనుల కంప్యూటరైజేషన్ మొట్టమొదట ఎక్కడ ప్రవేశపెట్టబడింది?

(ఎ) ఢిల్లీ, (బి) బొంబాయి, (సి) కలకత్తా, (డి) బెంగళూరు, (ఇ) మద్రాసు.

7. క్రింది వాటిలో ఏది వాయువాద్యం (wind instrument) కాదు?

(ఎ) ఫ్లూట్, (బి) షెహనాయి, (సి) నాదస్వరము, (డి) సితార్.

"చరిత్రను అభ్యసించడంకన్న సృష్టించడం మేలు."

—జవహర్‌లాల్ నెహ్రూ

8. UNO కి సంబంధించిన ఈ క్రింది ఏ ఏజెన్సీలకు పారిస్‌లో హెడ్‌క్వార్టర్స్ ఉన్నాయి?

(ఎ) ILO, (బి) FAO, (సి) UNESCO, (డి) WHO.

## పజిల్

అధారాలు-అడ్డం: 1. అరువది సంవత్సరాలలో ఒక సంవత్సరం పేరు. 3. దీనిని అందజేయుట కూడా వార్తాపత్రికల ఉద్దేశము, 6 మూడు అడుగుల దూరం, 7. శాశ్వతము, 9. నీటివంటి పలుచని పదార్థ




లేశము, 10. ఇది ఎంత చిన్నదానికైనా పెద్ద దెబ్బ అవసరం, 11. ఇవికూడా భిక్షుకలులాగే పగటిపూట వేపుకు తింటాయి, 13. వీటిని వదిలినప్పుడు దీనికి మిత్రుడైన సూర్యుడు శత్రువు అవుతాడు, 15. వికసించినది, 17. ఇండ్లలో గాలి, వెలుతురు ప్రవేశించడానికి ప్రత్యేకమైన అమరిక, 18. అరవిడిచిన ఎర్రగులాబులు మూటకడతాయి. 19. ప్రస

## లోభంవల్ల లాభంలేదు!

ఒక గ్రామంలో ఒక నేతి వర్తకుడు ఉండేవాడు. ఒకసారి అధికారులు కల్తీ నేతిని అమ్ముతున్నాడనే నేరంవల్ల ఆ వర్తకుని పట్టుకుని గ్రామాధికారివద్దకు తీసుకుని వెళ్ళారు. గ్రామాధికారి అతనితో "నీవు చేసిన నేరానికి మూడురకాలైన శిక్షలు ఉన్నాయి. ఒకటి: ఒక కిలో కల్తీ నేతిని నీవు త్రాగడం; రెండు: పన్నెండు దెబ్బలను భరించడం; మూడు: జరిమానా రూ. 200 లు చెల్లించడం. ఈ మూడు శిక్షలలో నీవు ఏదైనా ఒక శిక్ష కోరుకో!" అన్నాడు. ఆ నేతివర్తకుడు పరమలోభి. అందువల్ల కల్తీ నేతినే త్రాగడానికి ఒప్పుకున్నాడు. కల్తీ నేతిని కొంత త్రాగేటప్పటికి కడుపునొప్పి-వాంతులు మొదలైనాయి. అప్పుడు అతడు గ్రామాధికారితో "అయ్యా! నేను ఈ నేతిని త్రాగలేకుండా ఉన్నాను. కొరడా దెబ్బలను భరిస్తాను. నాకు ఆ శిక్ష ఇవ్వండి" అన్నాడు. కానీ అతనికి ఆరు కొరడాదెబ్బలకే వీపు చిట్లి రక్తం కారింది. ఆ బాధ భరించలేక 'అయ్యా! నేను రూ. 200 జరిమానా చెల్లించుకుంటాను" అని గ్రామాధికారికి ఆ డబ్బును కట్టాడు. ముందుగానే రూ. 200 లు జరిమానా చెల్లించి ఉంటే, కల్తీ నెయ్యి తిని కడుపులో నొప్పి తెచ్చుకోవడం, కొరడా దెబ్బలు తిని వీపు చిట్లడం జరిగేవి కావు. దీనికి కారణం అతడు లోభత్వంవల్ల సరియైన నిర్ణయం తీసుకోలేకపోవటమే? 'లోభంవల్ల లాభం కలగదు.

—బాబా

"మనుష్యునికి తాలిమి ఉత్తమబలం, అశక్తులకు ఉత్తమసాధన, శక్తివంతులకు ఉత్తమభూషణం."

న్నత పొందు అని అర్థమిచ్చే మాటలో రెండవ అక్షరం ముందు పడింది.

నిలువు: 1. శ్రీధరుడు, 2. ఆకాశము, 3. నాలుగు అను సంఖ్యకు గుర్తు, 4. బంగారము, 5. సంతోషము, 8. అడ్డు 1 వంటిదే మరొకటి, 10. 'వంటివాడు వంటినిండా మట్టి చేసుకున్నాడు' అనే వాక్యంలో "చేసు" కు బదులుగా తెలుగులో వ్యావహారికంగా వాడే పదం, 11. నాది అనే అభిమానం, 12. కమ్మగా ఉండే పాలు, 13. విరిగిన 'కుటిచి', 14. ఇది చేరటంవల్ల నదీ జలాలు కాలుష్యం అవుతాయి, 15. విమోచనము, 17. కోపము.

## తెలివికి పరీక్ష

1. ఈ క్రింది పక్షులన్నిటికీ సమాన లక్షణం ఏమిటి?

బాడ్జెర్, గూబ, కివి, గబ్బిలము.

2. ఈ క్రింది వరుసలో తరువాతి రెండు సంఖ్యలు ఏవి?

8 4 7 3 6 2 __ __

3. క్రింది వాటిలో ఇముడనిది ఏది?

హిమాలయాలు, అట్లాస్, ఆండీస్, ఆల్ప్స్, రాకీ సహారా.

4. శ్రీ వేంకటేశ్వర స్వామివారి సుప్రభాత శ్లోకంలో శ్రీ వేంకటాచలపతి నివాసమైన తిరుపతి కొండకు ఒక శ్లోకంలో చెప్పిన ముఖ్యమైన ఆరు పేర్లు ఏవి?

5. ఈ క్రింది చరణంలో "వెలలేని" "చేయ" మధ్య క్రింది అక్షరాలను అర్థవంతమైన మూడు మాటలుగా వ్రాసి అన్నమా

### విసడమ్
### పోటీల కూపను
### మే 1989

చార్య సంకీర్తన చరణం పూర్తిచేయండి,

"వేకి నచ్చి వెల ముదిదతె"__

6. ముఖ్యంగా అభివృద్ధి పొందని దేశాలలో దీని లోపం వల్ల పిల్లలకు గ్రుడ్డితనం కలుగుతుంది:

### 'అనకొండా' సర్ప భారం 200 పౌండ్లు



ANACONDA

దక్షిణ అమెరికాలో నివసించే అనకొండా (Anaconda) సర్పము 28 అడుగుల పొడవుగా ఉండి 200 పౌండ్ల భారం తూగుతుంది. ఇవి తమ ఆహారం కోసం పట్టుకున్న జంతువులను గట్టిగా చుట్టేసుకుని బ్రహ్మాండమైన ఒత్తిడి శక్తితో అదిమి చంపేస్తాయి. తరువాత వాటిని మింగేస్తాయి. ఈ ప్రక్రియ పూర్తికావడానికి కొన్ని గంటల కాలం పడుతుంది. ఈ పాము జఠరకోశంలో స్రవించే శక్తివంతమైన జఠరరసాలు పెద్ద పెద్ద ఎముకలను కూడా కరిగించేస్తాయి.

"ఇష్టమైన పనిలో కష్టమే తెలియదు."

## విస్డమ్
### పోటీల కూపను
### మే 1989

(ఎ) ప్రోటీనులు, (బి) విటమిను C, (సి) విటమిను A, (డి) కార్బోహైడ్రేటు.

7. బోయింగ్ విమానం అంత వేగంతో నీవు ఎప్పుడు ప్రయాణం చేయగలవు?

8. ఇంటిని చూస్తే ఎవరిని చూడనక్కర లేదు అంటారు.

## మాటలమహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను సూచించండి.

1. పరువు: ప్రసరించు (ఎ), ప్రవహించు (బి), ప్రసిద్ధమగు (సి), పరుగు (డి).

2. పంపు: పంపించు (ఎ), ఆజ్ఞాపించు (బి), విధించు (సి), భాగము (డి).

3. పెట్టు: ఇచ్చు (ఎ), వడ్డించు (బి), పొందించు (సి), నిర్ణయించు (డి).

4. కవిలె: ఆలింగనము (ఎ), అయిదు అరిటాకుల బొత్తి (బి), జత (సి), తాటియాకు పుస్తకముల కట్ట (డి)

5. గద్దరి: నేర్పరి (ఎ), దుష్టుడు (బి), అదలించు (సి), గణించినవాడు (డి).

6. కాయము: బాలింతల కిచ్చెడి మందు విశేషము (ఎ), దేహము (బి), మూలధనము (సి), గృహము (డి).

7. కైదువ: చెరసాల (ఎ) వాడియైన అంచు (బి), చేతి పొరపాటు (సి), ఆయుధము (డి).

8. కడతేరు: మరణించు (ఎ), సిద్ధించు (బి), బ్రతుకు (సి), కృతార్థత నొందు (డి).

## మీరైతే...?

"అహంకారం అనర్థ హేతువు" అంటే మీరు ఏం అంటారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## యోచన ప్రభావము



యోచన, వాక్కు, క్రియ మూడూ ఒకదానికి ఒకటి సన్నిహిత సంబంధం కలిగి ఉంటాయి.

వాటి ఆవిర్భావ పైఖరిని పరిశీలిస్తే యోచన ఒక్కటే మిగిలినవాటికి ఆధారం అనిపిస్తుంది.

మనం అనుభవించే సుఖం, దుఃఖం; ఇష్టం, అయిష్టం; ఆధిక్యత, న్యూనత మొదలైన ద్వంద్వాలన్నీ యోచన ప్రదర్శించే ప్రత్యక్ష నాటకం తప్ప వేరుకాదు.

యోచనా పేటికలో విశ్వరహస్యాలు భద్రపరచబడి ఉంటాయి.

యోచన లేనిచో అంతా శూన్యమే. తిరిగి దివ్యయోచనాపరిధికి పైన అంతా శూన్యమే.

— యోగిరాజ్ వేదాద్రి మహర్షి

"హిందూధర్మం సూక్ష్మంగా చెప్పాలంటే మంచిని ఆచరించటమే."

# పోటీల ఫలితాలు

(మార్చి 1989)

వ్యాసం - విజేతలు - మొదటి బహుమతి: పి. మోహన్‌రావు, శ్రీకాళహస్తి, (చిత్తూరు జిల్లా); రెండవ బహుమతి: కర్రి క్రిష్ణమ్మ, వీరఘట్టం, (శ్రీకాకుళం జిల్లా); మూడవ బహుమతి: కుమారి పి. జ్యోతి, కమ్మపల్లి, (చిత్తూరు జిల్లా).

క్విజ్ - జవాబులు: 1. (ఎ) కన్యాకుమారి, 2. (సి) బార్సిలోనా, 3. (ఎ) మాల్దీవులు, 4. (బి) యూకలిప్టస్, 5. (ఎ) పెట్రోలియం ఎగుమతి చేసే దేశాల సమూహం. 6. (ఎ) వల్లభాయిపటేల్, 7. (ఎ) ఇండియా, 8. (ఎ) పాల ఉత్పాదన.

విజేతలు-మొదటి బహుమతి: ఎస్. శ్రీనివాసరెడ్డి, మదాకా, (కరీంనగర్ జిల్లా); రెండవ బహుమతి: జె. శంకర్, హన్మకొండ; మూడవ బహుమతి: ఎమ్. బచ్చిబాబు, సికింద్రాబాద్.

పజిల్ - జవాబులు - అడ్డం: 1. శ్రీమతి, 3. గంగాజలము, 6. రుగ్మత, 7. ఖముగ, 9. ముగ్గురు, 10. వీసర, 11. గగన వీధి, 13. చమురు, 15. గమకములు, 18. విరత, 20. టక్కరి, 21. లురముపుపా, 22. విసరు.

నిలువు: 1. శ్రీముఖ, 2. తిరుగ, 3. గంతలవీధి. 4. జలమురచ, 5 ముగురు వీరు, 8. మునగ, 11. గసగసాలు, 12. వీసము, 14. ముదర, 16. కరము, 17. లుటపా, 18. విరివి, 19. కబురు.

విజేతలు - మొదటి బహుమతి: జె. శంకర్, హన్మకొండ; రెండవ బహుమతి: గడిగ సంజీవరెడ్డి, నూతనపల్లె, (కర్నూలు మండలం); మూడవ బహుమతి: ఎ. రాజరాజేశ్వరి, విశాఖపట్టణం.

తెలివికి పరీక్ష - జవాబులు: 1. అనువుకాని చోట అధికులమనరాదు, 2 38, 3. ఇంకా సమాజంలో కులవివక్షణ పోలేదు, హత్యలవంటి సంఘటనలు జరుగుతున్నాయి, 4. క్రొత్తావి, క్రొన్నన, క్రొమ్ముడి, క్రొవ్విరి, 5. బిందువు, 6. 1. కర్మయోగి 2. కర్మిష్ఠుడు, 3 కర్మశూరుడు, 4. కర్మాత్ముడు, 7. (ఎ) రంగయ్య పిత్రార్జితం అంతా కాజేసినాడు, (బి) నా సొమ్ము వాడు కాజేసినాడు (సి) ఆ పని కాజేసుకుని త్వరగా రావోయి, (డి) తల్లి లేనప్పుడు ఇంట్లో పిల్లలంతా పళ్ళెంలో జిలేబి పూర్తిగా కాజేసారు 8. 4 సంవత్సరాలకు ముందు.

విజేతలు - మొదటి బహుమతి: కోగంటి సాంబశివరావు, తెనాలి. (గుంటూరు జిల్లా); రెండవ బహుమతి: పి. మోహన్‌రావు, శ్రీ కాళహస్తి, (చిత్తూరు జిల్లా); మూడవ బహుమతి: ఎ. రాజరాజేశ్వరి, విశాఖపట్టణం.

మాటల మహిమ - జవాబులు: 1. సూక్ష్మదృష్టి (ఎ), నేర్పరితనము (బి), పాండిత్యము (సి), వివేకము (డి); 2. సామ్యము (ఎ), విధము (బి), ఖ్యాతి (సి);

''అపజయానికి వెరచేవాడు ఉద్యమానికి అవధులు కల్పించుకుంటాడు, వివేకవంతంగా తిరిగి ప్రారంభించ

3. అందమైనది(ఎ), ఒక జాతి పేరు (బి); 4. చెప్పనిచ్చు (ఎ), ఇచ్చు (బి), అర్థము (సి). ఉద్దేశము (డి ; 5. కమ్మదనము (ఎ), మాధుర్యము (బి), సువాసన (సి); 6. గంత (ఎ), ఇంద్రజాలము (బి); 7. ముడి (ఎ), గాయపరచు (బి); 8. పొట్టి వాడు (ఎ), చిక్కనిది (బి).

విజేతలు - మొదటి బహుమతి: దశిక కృష్ణమోహన్, నరసాపురం, (ప గో. జిల్లా); రెండవ బహుమతి: బి. ఎస్. ఎన్. మూర్తి, కాకినాడ; మూడవ బహుమతి: గడిగ సంజీవరెడ్డి, నూతనపల్లె, (కర్నూలు మండలం).

ముఖచిత్రవ్యాఖ్య-మొదటి బహుమతి: కోరాడ దుర్గారావు, అనకాపల్లి; రెండవ బహుమతి: కర్రి క్రిష్ణమ్మ, వీరఘట్టం, (శ్రీకాకుళం జిల్లా); మూడవ బహుమతి: వై. భాగ్యరేఖ, ధర్మవరం, (అనంతపురం జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు - రెండవ బహుమతి: పి. వి. శేషుబాబు, శ్రీరాం నగర్, (విజయనగరం జిల్లా); మూడవ బహుమతి: కొండూరు చంద్రశేఖర్, అంకి రెడ్డిపాలెం (గుంటూరు జిల్లా).

మీరైతే...! - మొదటి బహుమతి: మహమ్మద్ ఖలీలొద్దీన్, ముస్తలాపూర్, (కరీంనగర్ జిల్లా); రెండవ బహుమతి: డి. జి. శంకర శ్రీనివాస్, గంగచోళ్ళ పెంట, (విజయనగరం జిల్లా); మూడవ బహుమతి: ఎమ్. సూర్యప్రకాశరావు, రామ రాజు లంక, (తూ గో. జిల్లా).

## వాటర్ హయసింత్ కాలుష్యాలను హరిస్తుంది


WATER HYACINTH

వివిధ పరిశ్రమలు మరియు గృహాలు వదిలిపెట్టే వ్యర్థమైన మురుగు నీటిలో కరిగి పోయిన వివిధ కాలుష్యాలను నీటి కలువ వంటి 'వాటర్ హయసింత్' (Water Hyacinth) హరించేస్తుందని యునైటెడ్ స్టేట్స్ నేషనల్ ఎయిరోనాటిక్ అండ్ స్పేస్ ఎడ్మినిస్ట్రేషన్ (NASA) వారు తెలియ జేస్తున్నారు. బాగా విస్తరించుకున్న నీటి మొక్కల వేళ్ళకు నీటిని పీల్చుకునే శక్తి అధికంగా ఉంటుంది. ఒక హెక్టేరులో పెరిగిన వాటర్ హయసింత్ 2,40 000 లీటర్ల మురుగునీటినుండి 211.2 గ్రా.ల సీసపు లోహాన్ని, 200 గ్రా.ల పాదరసాన్ని. 283.4 గ్రా.ల వెండిని, 300 గ్రా.ల నికెల్ లోహాన్ని పీల్చుకుంటుందని NASA వారి పరిశోధనా ఫలితాలు సూచిస్తున్నాయి.

—'పిఐఇ-ఎన్‌ఎఫ్‌ఎస్' సౌజన్యంతో

"మితిమించిన సంతానం తలకుమించిన బరువు."

